

"కూతురే కోడలు" చిత్రంలో విజయలలిత

# ఉత్తరాలు

## కథలు

23 ఏప్రిల్-71 సంచిక తీసుకొన్న చాలా రోజు లకు యీ ఉత్తరము వ్రాయుటకు తీరినది. సారీ....

బేతాళుడు చెప్పని కథ
వాతోడుగ నాకు బాగ నచ్చినదయ్యా
సీతా కథ చెప్పిన మీ
తాతాదారుణ్ణి నేను కంచనపల్లి!

వి. సి. కరుణాకర్, (పూనా)

* * *

'శ్రీవారితో పుట్టింటికి' ముగింపు చాలా బాగుంది. ఇటువంటి కథలు మరికొన్ని రాసి, మమ్మల్ని సంతోషపరుస్తారని మేము ఆశించుచున్నాము.

రావకొండ చిన్న కామేశ్వరరావు. (మండపేట)

* * *

మీ 21—5—71 పత్రికలోని 'ఆహుతి' కథ చదివితే చాలా బాధాకరంగా ఉంది. ఈ కథ ఈ రోజుల్లో వ్రాయువలసింది కాదు. ప్రచురించవల సింది అంతకంటే కాదు. ఈ వ్యాధికి దాదాపు మూడు దశాబ్దాల క్రితం సరియైన మందులు లేవు. కాని నేడు అమోఘమైన మందులు మధ్యతరగతి ప్రజానీకానికి గూడా అందుబాటులో ఉన్నవి. పేర్పు గల స్పెషలిస్టులు ఉన్నారు. దేహంటు జబ్బునే కాదు, మనస్సును గూడా మార్చివేయుగల నిపుణులున్నారు. కాని పరిస్థితులిలా ఉండగా రచయిత దాన్నిపట్టుకొని భయంకరమైన వ్యాధనీ, డాక్టర్లు ట్రీట్ చేయ లేరనీ, ప్రాణాల్ని తీయక వదలదనీ చిత్రించడం కేవలం రచయిత అజ్ఞానానికి నిదర్శనం. క్షయ వ్యాధి సోకి బాగుపడి పెళ్లిచేసుకొని భార్యాబిడ్డలతో సుఖంగా కాపురం చేస్తున్న గృహస్థులెందర్నో నేనెరుగుదును. రచయిత వ్రాసేదే నిజమైతే ఇందులో చాలామంది ప్రకాశంలు ఉండాల్సింది గదా?

నేడు మనదేశంలో 'పల్మొనరీ ట్యుబర్కులోసిస్' విశేష వ్యాప్తిలో ఉంది. రోగుల సంఖ్య పెరుగుతూంది. వివా నమ్మకమైన చికిత్స ద్వారా బాగుపడుతున్నారు. అటువంటప్పుడు ఇలాంటి కథలు చదివితే వాళ్ల మనస్థితి ఎలాగుంటుందో కొంచెం ఆలోచించండి. మిమ్మల్ని కాని రచయితనుగాని విమర్శించాలనికాదు కాని వాస్తవ పరిస్థితులు మీ ముందుంచుతూ మిమ్మల్ని కోరే దేమిటంటే, మీ పత్రికాపటనం ద్వారా పాఠకుల మనస్సుల నుల్లాస పర్చుకంపోయి ఇలాంటి కథలు ప్రచురించి వారి మనస్సులను అల్లకల్లోల పర్చడం ఆవాంఛనీయం. రచయిత చిరునామా తెలిపితే వారికి గూడా ఒక లెటర్ వ్రాయడానికి మేము సిద్ధం. ప్రజాశ్రేయస్సు దృష్ట్యా, పత్రిక భవిష్యత్ దృష్ట్యా ఇలాంటి కథలు ప్రచురించడం పూర్తిగా నిషేధించాలని మిమ్మల్ని మరో మారు కోరుతూ ముగిస్తున్నా.

డాక్టరు వి. వీరబ్రహ్మం, (సికింద్ర)

* * *

'కొత్తదుప్పటి' కథ చాలా బాగున్నది. మల్లెలు ఎర్రగులాబీలు సీరియల్ కూడా బాగున్నది.

కె. శకుంతల, (మచిలీపట్నం)

## సీరియల్

'మల్లెలు—ఎర్రగులాబీలు' ముగింపు చాలా బాగున్నది. ముఖ్యంగా శారద, రాముల పాత్రలను రచయిత చాలా హుందాగా పోషించారు. డాక్టరు యర్రం చంద్రశేఖరం గారికి నా అభినందనములు.

జి, రా, భ,రా (మదనపల్లి)

* * *

'మల్లెలు—ఎర్రగులాబీలు' సీరియల్ మాకు చాలా బాగుంది.

తాడాల రత్నకుమారి, సరోజినీదేవి, రాజామలోచన, (పిఠాపురం)

---


నరికొత్త సాహిత్యపు పోటీ

సుప్రీంకోర్టు తీర్పు ననుసరించి నడుపబడుచున్న
సాహిత్యపు పోటీ నెం. 1
ముగింపు తేదీ : 15—7—1971.
ఫలితాలు: 20—7—1971.
(ఆంధ్రపత్రిక దిన పత్రికలలో)

గెలవండి రు. 25,000
శ్రీ వాణీ ట్రేడర్స్ (రిజిష్టర్డు)
ఏలేశ్వరం (P. O.) తూ॥ గో॥ జిల్లా.

ఆల్ కరెక్టు రు. 12,000.
స్పెషల్ ఆల్ కరెక్టు : రు. 5,000
1 తప్పు : రు. 4,000.
2 తప్పులు: రు. 2,000.
కన్సొలేషను బహుమతులు :—
రు. 1,000., 500. 300., 200
(ఎక్కువ కూపన్లు పంపినవారికి)

ఒక కూపను : రు. 1/—. 6 కూపన్లు : రు. 5/—

ఆధారములు :—

1. భర్త యింటికి తిరిగి రాగానే పెళ్లాం (నవ్వు / కేక) చూస్తుందట. అదే తల్లి అయితే (కొడుకు / కుమారుడి) కడుపు చూస్తుందట.
2. మనస్సుని (పరవశింప / పులకరింప) చేసే విషయాలు యెన్నెన్నో వుంటాయి— జనదారిలో, కాని అదే (మనుగడ/బ్రతుకు) కాదుకదా?
3. (సమాజం / సంఘం) లో, దేశంలో జరుగుతున్న సంఘటనలు—మారు తున్న చరిత్రయొక్క ప్రవక్తే పట్టకుండా, తమ ధోరణిలోనే తాము జీవించే (బుద్ధిమంతులు / ప్రబుద్ధులు) చాలామంది యున్నారు.
4. ఏదైనా యితరులకి యివ్వడంలో (ఆనందం/అనుభూతి) పొందుతారు కాని తనకు తాను తినడంలో ఏమీ (తృప్తి/సంతృప్తి) వుండదు కొందరికి.
5. జీవితంలో (స్త్రీ / ఆడదానికి) వివాహము ఒక బ్రహ్మాండమైన (మార్పు / మలుపు).
6. అర్ధాంగి (ఆదర్శవతి / అనుకూలవతి) అయితే సంసారం స్వర్గ సుఖాలకు (ఆవాస / ఆనవ) మవుతుంది.

నిబంధనలు :—1 ఒక్కొక్క క్లూలో రెండేసి పదములు చొప్పున రెండు చోట్ల యివ్వబడినవి. అందులో మీరు కరెక్టు అనుకొన్న పదములు తెల్లకాగితము మీద వ్రాసి ఎం. ఓ. రశీదుగాని, క్రాసుచేయని ఐ. పి. ఓ. గాని జతపరచవలెను. 2. ఒక్కరే ఎన్నికూపన్లు అయినను పంపవచ్చును. ఒకరే ఎన్ని ప్రైయిజులైనను పొందవచ్చును. 3. స్పెషల్ ఆల్‌కరెక్టు బహుమతి 30—6—1971 తేదీలోపున మాకు చేరిన ఆల్‌కరెక్టు కూపన్లకు మాత్రమే పంచబడును. 4. ఒక క్లూలో ఒక పదము తప్పు అయినను, రెండు పదములు తప్పు అయినను "ఒక తప్పు"గానే ఎంచబడును. 5. రచయిత(త్రి) వాడిన పదమే సరియైనది. తెలుగు పుస్తకములనుండి సేకరించిన ఈ వాక్యములు రచనలు, రచయిత(త్రి)ల పేర్లు, పేజీలతో సహా ప్రకటించబడును. 6. ఒకరికన్న ఎక్కువమంది విజేతలున్నచో బహుమతుల మొత్తము సమముగా పంచబడును. 7. మేనేజిమెంటు వారిదే తుది నిర్ణయము. వివాదములు పెద్దాపురం కోర్టులో పరిష్కరించుకోవాలి. 8. ఆక్షేపణలున్నచో ఫలితములు ప్రకటించిబడిన 10 రోజులలో రు. 10/— లు ఎమ్. ఓ. చేస్తూ మాకు తెలియపర్చాలి. ఆక్షేపణలు నిజంకానిచో రు. 10/— లు కోల్పోవుదురు. 9. ముగింపు తేదీ సాయంత్రం 5 గంటలు లోపున మాకు కూపను చేరాలి. 10. విజేతల లిస్టు, తర్వాత పదావళి ఎంట్రీల కొరకు 35 పై. స్టాంపులు జతపర్చాలి. మీ కూపన్లు, మనియార్డర్లు

M/s SRI VANI TRADERS (Regd.) YELESWARAM (P.O.) E. G. Dt. (A. P.) పంపండి.

ముఖ్య గమనిక:— ముగింపు తేదీ దాటిన తర్వాత కూపన్లు ఎంతమాత్రము స్వీకరించబడవు. ముగింపు తేదీ పొడిగించబడదు. కూపన్లలో దిద్దు పొట్లు, తుడుపులు, కొట్టివేతలు వుండకూడదు. ఆల్ కరెక్టు ఎవ్వరూ లేనిచో ఒక తప్పు వచ్చిన వారికి ఆల్ కరెక్టు బహుమతులు పంచబడును.

*తప్పక చూడండి!*

సుందరలాల్ నహాతా సమర్పించు

SS శ్రీకాంత్ & శ్రీకాంత్

ఎంటర్ ప్రైసస్ వారి

# సతీ అనసూయ

దర్శకత్వం: బి.ఏ.సుబ్బారావు

సంగీతం: ఆదినారాయణరావు

ఈస్ట్‌మన్ కలర్







సిద్ధ, ఆయుర్వేదముల్ బ్రహ్మాండమ్మైన తయారు. ఇవి కోల్పోయిన శక్తి, దాతు బలహీనత, పిండు బలహీనత, నరముల బలహీనతను పోగొట్టి మీకు కుటుంబసుఖం, జీవితసుఖం ఇచ్చేదానికి ఈ మాత్రకు ఏది సమం లదు. చాలమంది నుండి బహుమతులు పొంది వున్నది. మీరు "నేనే" వాడండి. 100 మాత్రలు రు. 37-50. 50 మాత్రలు రు. 20/- పోస్టేజి రు. 3/- ముందుగా డబ్బు పంపవలెను. 50 మాత్రలకు తక్కువ పంపబడవు.

KARTHIKFYA VAIDYASALAI
PALANI P. O.
Madurai Dt. (Tamil Nadu)


## లియో క్విజ్ నెం. 1

### ఋ వ్వా పు ర ం

N.G.O.'s స్ట్రయిక్ కారణంగా మాతాలూకా రిజిస్ట్రేషన్ నెంబరు రాకపోవుటచే పోస్టలు వారు డెలివరి యిచ్చుటకు అభ్యంతరము తెల్పుటచే మాకు Letters, M. O. లు అందలేదు. అందువలన మా తాలూకా రిజిస్ట్రేషన్ నెంబరు వచ్చిన తరువాత మరల ఎడ్వర్టైజమెంటు చేసి ప్రారంభిస్తామని తెలియపర్చుటకు విచారిస్తున్నాం.

మేనేజరు.


వాయిదాల పద్ధతిపై ట్రాన్సిస్టర్



స్టాండర్డు (జపాన్ మాడల్) 3 బ్యాండ్ ఆల్‌వరల్డ్ డబుల్ స్పీకర్ నైట్‌ల్యాంప్ బిగించబడిన ట్రాన్సిస్టరును నెలకు రు. 10/— వంతున వాయిదాలపై పొందవచ్చును. ప్రతి గ్రామానికి పట్టణానికి పంపబడును. ధర రు. 300/—
Allied Trading Agencies (54)
P. B. 2123, DELHI-7.


# ఉత్తరాలు

యర్రం చంద్రశేఖరం గారి 'మల్లెలు—ఎర్ర గులాబీలు' సీరియల్ బాగుంది.

ఆంధ్ర పాఠకుల అభిరుచుల ననుసరించి సీరియల్ కామెడీ చేశారు. కాని సుందరం మోసాన్ని బయట పెట్టించడానికి శారదా, నీరజలు వేసిన ప్లాను అంత సహజంగా లేదు. అది ఒక్కటి తప్పితే,,, అంతా బాగుంది.

రచయిత, శారద, శాంతల మనస్తత్వాలను మల్లెలు—ఎర్ర గులాబీలతో చక్కగా పోల్చారు. శారద మనస్సు చక్కని సౌరభాలను వెదజల్లే మల్లెపువ్వు వంటిదైతే, శాంత మనస్సు అతి సుకుమారమ్మైన గులాబీ వంటిది. అటువంటి శాంతను స్వంతం చేసుకోవడానికి రామం గులాబీ వెనుకనున్న ముళ్ళను అతి చాకచక్యంతో తప్పించుకొని చివరకు ఆ గులాబీని సంపాదించుకున్న రామాన్ని అభినందించక తప్పదు.

సీరియల్‌కు తగినట్లుగా టైటిల్ నిర్ణయించటంలో రచయిత ప్రతిభ పాఠకులకు వెల్లడి అయినది.

కుమారి కోటగిరి భారతి, (చింతలపూడి)

## మీకు తెలుసా?

'మీకు తెలుసా?' శీర్షికలో నటుడు రమణమూర్తి ఏక్సిడెంటులో గాయపడ్డాడని ప్రచురించేరు. ఆయన త్వరగా కోలుకొని మళ్లీ చిత్రాల్లో పూర్వపు స్థాయిలో నటించాలని ఆశిస్తున్నా.

టి. యస్. రామారావు [హైదరాబాద్]

## సినిమా బాలట్

సినిమా బాలెట్ విషయంలో వచ్చిన విమర్శలకు మీరు ఎందుకు సమాధానం యివ్వలేకపోయారో నాకు అర్థం కావటంలేదు. 10 శాతం కంటె తక్కువ వచ్చిన వాళ్లెవరూ పోటీలో నిల్చోలేక పోయారు. శ్రీ నాగేశ్వరరావు తరువాత అధిక శాతం రామారావుకే వచ్చింది. ఇది బహుశా ఆయన అభిమానుల ప్రత్యేకాభిమానానికి నిదర్శన కావచ్చును. రామారావుగారు బాలెట్‌లో నుండి విరమించిన విషయం వోటర్లకు తెలియుతంటే నేను నమ్మను. ఇక రామారావు గారికి అంత శాతం రావటం. దానిని వారు ప్రకటించడం పత్రికాధిపతుల తప్పు ఎంతమాత్రమూ కాదు. అది కేవలం వారి అభిమానుల తెలివి తక్కువతనాన్నే చూపిస్తుంది. అంటే రామారావుగారి అభిమానులలో సుమారు 21 శాతం ప్రత్యేకాభిమానులు వున్నారన్న మాట.. విమర్శకులు దీనిని అర్థం చేసుకోగలరనుకుంటాను. ఆవేశంలో ఆలోచించి పనులు చేస్తే అభిమానుల మధ్య కక్షలు తప్ప స్నేహం మాట వినిపించదు.

హెచ్. వైకుంఠరావు, (విశాఖపట్నం)


# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 18—6—'71
శ్రీ విరోధికృన్నామ సం॥ జ్యేష్ఠమాసం బ॥ అష్టమి
సంపుటము : 64 సంచిక : 41

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26·00 |
| 6 మాసముల చందా | 13·00 |
| 3 మాసముల చందా | 6·50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి రాజశ్రీ

# సంక్షేమనిధి నిర్వహణ—పాలకుల అనాసక్తత

ఉత్సాహం, కార్యదీక్ష చూడాలంటే ఠాకూర్ హరిప్రసాద్‌లో చూడాలి. నాలుగైదు సంవత్సరాల క్రితం అతని గూర్చి తెలిసిన వారిసంఖ్య బహు స్వల్పం. రాష్ట్ర శిశు సంక్షేమ సంఘ గౌరవ కార్యదర్శిగా తరువాత గౌరవ ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్‌గా రాష్ట్ర సంక్షేమ నిధి గౌరవ కార్యదర్శిగా క్రితం నాలుగు సంవత్సరాల్లో అతని పేరు రాజధాని, అంతటా మారుమ్రోగి పోయింది. సచివాలయంలో చిన్న ఉద్యోగిగా జీవితం ప్రారంభించిన ఈ వ్యక్తి ఇలా తారాజువ్వలా వెలిగి పోవాలంటే ప్రత్యేకమైన శక్తిసామర్థ్యాలేవైనా అతనిలో ఉండాలి కదా.

## ఠాకూర్ నిర్బంధం

తెలంగాణా ఆందోళనవరుల విషయంలోను నక్సలైట్ విప్లవకార్ల పట్లను పోలీసు మంత్రి జలగం వెంగళరావుగారు తీసుకున్న చర్యలు కొందరిలో ఆయన పట్ల ఆగ్రహాన్ని కల్పిస్తే, మరికొందరిలో ప్రశంసను కూడా కలిగించాయి. రాష్ట్ర సంక్షేమ సంఘం నిర్వహించే రాఫిళ్ళతో ఠాకూర్‌కు సంబంధం లేకుండా చేయడం, ఆతరువాత అతని కార్యకలాపాల గూర్చి పోలీసుశాఖ పరిశోధన చేసి చివరికి అతనిని అరెస్టు చేసి విచారణకై కోర్టులో ప్రవేశ పెట్టేట్టు చేయడం, వెంగళరావు గారు స్వయంగా శ్రద్ధ వహించడం మూలంగానే జరిగిందనడంలో అతిశయోక్తి లేదు.

ఠాకూర్‌పై పోలీసులు చేసిన ఆరోపణలు ఘోరమైనవి. వాటి నిజానిజాలు కోర్టువారే నిర్ణయిస్తారు. కాని రాష్ట్ర గవర్నరు, ముఖ్యమంత్రి పోషకులుగా ఆరోగ్యమంత్రి చైర్మనుగా, విద్యామంత్రి, శాసనసభా ప్రతిపక్ష నాయకుడు ఉన్నత ప్రభుత్వోద్యోగులు సభ్యులుగా కల సంక్షేమ నిధి సంఘం వ్యవహారాలు ఈ విధంగా వీధిని పడడం గౌరవప్రదంగా కనిపించడం లేదు.

శాసనసభలో ప్రతిపక్షాల వారు ఈ నిధికి సంబంధించిన సంఘాన్ని, దాని కార్యదర్శిని దుయ్యబట్టే వరకు దాని గూర్చి పట్టించుకున్న వారే కనిపించలేదు. ప్రతిపక్షాల విమర్శ మూలంగానే ఆంతరంగిక వ్యవహారాలమంత్రి వెంగళరావుగారు విచారణ చేయిస్తామని హామీ ఇచ్చారు. ఆ హామీ ఫలితంగా పోలీసులు విచారణ చేసి మేజిస్ట్రేటు ముందు ఠాకూర్‌ను ప్రవేశపెట్టారు.

## ప్రజలలో విశ్వాసం

పైన పేర్కొన్నట్టు ఆరోపణల నిజానిజాలు ఎలా ఉన్నా, ఈ విచారణ మూలంగా ఆంధ్రప్రదేశ్ సంక్షేమ నిధి వారు నిర్వహించే రాఫిళ్ళపైన ప్రజల్లో విశ్వాసం క్షీణించిపోయింది. ఒక్క మనరాష్ట్రంలోనే రాఫిళ్లను ప్రభుత్వం స్వయంగా కాక అనధికారకమైన సంక్షేమనిధి సంఘం ద్వారా నిర్వహింపబడుతున్నాయి. రాఫిళ్ల మూలంగా ప్రభుత్వాలు ప్రజల నుంచి నిధులు సేకరించడం సమంజసమా కాదా అన్న విషయం వివాదాస్పదం కావచ్చును కాని దాదాపు ప్రతి రాష్ట్రప్రభుత్వ మిప్పుడు రాఫిల్ రూపంలో లక్షలు కోట్లు వసూలు చేస్తున్నది. ఆంధ్రదేశ ప్రజలు ఇతర ప్రజలతో పాటు లక్షల కోట్ల రూపంలో రాఫిల్ టికెట్లు కొని ఇతర రాష్ట్రాల రాఫిళ్లను పోషిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ సంక్షేమనిధి నిర్వహణ మన పాలకుల అనాసక్తతకు చక్కని తార్కాణమని చెప్పవచ్చును.

ఇప్పటికైనా గవర్నరుగారు, ముఖ్యమంత్రి, ఇతర మంత్రులు ఈ సంక్షేమనిధి సంఘం నుంచి వైతొలగి ప్రభుత్వమే నేరుగా రాఫిళ్ల నిర్వహణకు పూనుకునేట్టు చేయడం వాంఛనీయం. ఎందుకంటే, బీదజనావళి పట్ల సానుభూతిని బాధను వ్యక్తం చేయడం మన రాష్ట్ర ప్రభుత్వానికి అలవాటైపోయినా, దీనజనోద్ధరణకు పన్ను ద్వారా నిధి సేకరణకు పూనుకొనడం కష్టమే. రాఫిళ్ల ద్వారానైనా నిధి సేకరించి పొరుగు రాష్ట్రమైన తమిళనాడు వలె ప్రజాహిత కార్యక్రమాలను చేబట్టవచ్చును.

తమ రాష్ట్రంలో బిచ్చగాళ్ళ బెడదను రూపుమాపడానికి ముఖ్యమంత్రి కరుణానిధిగారు స్వయంగా పూనుకున్నారు. తమ జన్మదినోత్సవం సందర్భంలో తమను అభినందించడానికి వచ్చే వారందరి వద్ద చందాలు ఇందుకోసం వసూలు చేశారు. తమిళనాడు రాఫిల్ బంపర్ ఆఫర్ వసూళ్లన్నింటినీ, బిచ్చగాళ్ల కోసం, కుష్ఠు వ్యాధిగ్రస్తుల కోసం పునరావాస గృహాల నిర్మించడానికి వినియోగిస్తామని ప్రకటించారు.

ఎవరు మీ స్నేహితుడు?

ఆపదలో ఆదుకునే వాడే గదా! చదువురాదని భయపడిన వారు, క్లాసు రాలేదని బాధపడినవారు, శ్రమ శిక్షణ లేదని నిరాశ చెందిన వారెందరో! స్నేహితునిగా సలహాలిచ్చి, సోదరునిగా ప్రేమించి, అధ్యాపకునిగా దండించి, తండ్రిగా సౌకర్యాలను సమకూర్చి కృషి చేశాం. 10 వేల మందిలో 80 శాతం వింతో మార్పు చెందారు. ఫస్ట్‌ఫారంనుండి డిగ్రీవరకు శిక్షణ. 80 మంది అధ్యాపకులు—ఆరు హాస్టళ్ళు—రెండు లాడ్జ్స్. జూన్ 6నుండి అడ్మిషన్స్. జూలై 1 నుండి క్లాసులు. ఇంకా వివరాలు కావాలంటే మా పూర్వ విద్యార్థుల నడగండి. లేదా మాకు వ్రాయండి.

రవి కళాశాల

బ్రాడీపేట, గుంటూరు—2

ఫోన్స్: 20917, 21192 డైరెక్టర్ C.V.N. ధన్ M.A.

**బిచ్చగాళ్ల సమస్య**

ఈ రాజధాని నగరంలోను, మన ఇతర పట్నాల్లోను బిచ్చగాళ్ల సమస్య తీవ్రంగా ఉంది. రైలు స్టేషన్లలో, బస్సుస్టాండుల్లో హోటళ్ల దగ్గిర ఎక్కడ చూచినా బిచ్చగాళ్ళే. విదేశీ వ్యక్తి కనపడడం పాపం, చుట్టూ మూగి బాధపెడ్తారు. పార్కుల్లో కూడా వీరి బెడద తప్పదు.

మన టూరిజం మంత్రి శ్రీమతి రోడా మిస్త్రీ శాసనసభ్యురాలుగా ఉన్న రోజుల్లో దాదాపు ప్రతి బడ్జెటు చర్చ సందర్భంలోను భిక్షుకుల సమస్యా పరిష్కారం ఆవశ్యకత గూర్చి ప్రసంగిస్తూ ఉండే వారు. రాజధానికి సమీపంలో ఒక భిక్షక గృహం లేకపోలేదు. భిక్షాటనకు వ్యతిరేకంగా ఒక చట్టం కూడా ఈ నగరంలో అమల్లో నుంది. ఐనా భిక్షుకులకు దీని తాకిడి తగిలినట్లు లేదు. నాంపల్లి బస్సుస్టాండువద్ద ఒక నగ్న భిక్షుకిని చూడని వారుండరనుకుంటాను. ఆబిడ్స్‌లో ఒక అక్కాతమ్ముడు వాళ్ల ఐదారు సంవత్సరాల ప్రాయం నుంచి 'బస్సు కిరాయి' పేర అడుక్కోవడం చూసిన వారు పలువురుంటారనుకుంటాను. బషీర్‌బాగ్ వద్ద ఒక కుంటి భిక్షకుని సంసారం సాగరంలా పెరిగిపోతున్నది. ఏకకుటుంబంగా భిక్షాటన చేస్తాడతను. అప్పుడప్పుడు మ్యునిసిపాలిటీ వారు పోలీసుశాఖ మేల్కొని 'రౌండప్ చేస్తూ' ఉంటారు. కాని కొన్నిరోజుల తరువాత భిక్షగాళ్ళు తమ స్వస్థలాలకు చేరి తమ కార్యకలాపాలు కొనసాగిస్తూ ఉంటారు. బొంబాయి, కలకత్తా లాంటి నగరాల్లో భిక్షాటన వ్యవస్థీకృతంగా, జరుగుతుందంటారు. ఆ సూచనలు ఈ నగరంలో కనిపించవు కాని వ్యాధిగ్రస్తులు, కుంటి, గ్రుడ్డి వారే కాక శారీరకపుష్టి బాగా ఉండి బిచ్చమెత్తుకుంటున్న వారిసంఖ్య ఏమంత తక్కువ లేదు. వీరందరినీ పోగు చేసి సంఘానికి, వారికీ ఉపయోగపడేట్లుగా తయారు చేయడం అసాధ్యమైనది కాదు. కాని అందుకు తగిన వ్యవస్థ మన ప్రభుత్వానికి కాని పురపాలక సంఘాలకు కాని లేదు. ఫిలిప్పైన్స్ లాంటి చిన్నదేశంలో కూడా బిచ్చగాళ్ళు కనిపించరు. మనదేశంలో బిచ్చగాడు కనిపించకపోతే ఆశ్చర్యపడవలసి ఉంటుంది.

తమిళనాడులో భిక్షాటన వ్యతిరేక చర్యలు ప్రారంభమవుతే అక్కడి భిక్షకులుకూడా హైదరాబాదుకు ఇతర ఆంధ్ర పట్నాలకు తరలి రావచ్చును. ఇందుకోసమైనా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మ్యునిసిపల్ కార్పొరేషన్ అనాగరికమైన భిక్షాటనను రూపుమాపడానికి పూనుకోవాలి. మనవి ఎప్పుడూ లోటు బడ్జెటులే కనుక లాటరీల ద్వారానైనా భిక్షాటనా నిర్మూలనకు ప్రభుత్వం నిధి సేకరణ చేయాలి.

— [illegible]


**MyLady**

**BRAS • FULL BODIES**



**BEST IN FIT * FIRST IN FASHION**

**మైలేడి**

**బ్రేసియర్ * బాడీలు**

అన్నిచోట్లయందు దొరుకుతుంది....

# కంచే చేను మేస్తే...

బెంగుళూరు హిందూస్తాన్ ఏరోనాటిక్స్ సంస్థకు చెందిన ఒక సినిమా హాలుకు ఒకామె తన ప్రియునితో రెండో ఆట సినిమాకు వచ్చిందట. సుమారు పదిగంటల ప్రాంతంలో ఓ యిద్దరు కానిస్టేబుల్స్ వచ్చి ఆమెను వ్యభిచారిణి అని; ఆ నేరం ప్రకారం లాక్కెళ్తున్నామని చెప్తూ, లాక్కెళ్తూ, దారిలో ఆమెను చెరచడానికి ప్రయత్నం చేశారట. అనుమానించిన కొందరు ఈ విషయం పోలీసుకు తెలియజేస్తే వాళ్ళొచ్చి సమయానికి నేజారేతోగా ఆదుకున్నారట.

## వింతమొక్కు

గుల్బర్గాకు 18 కిలో మీటర్ల దూరంలో వున్న చిన్నానూరు అనే వూరిలో 'సహాపుర్‌తాయ్' అనే

ఏం గురూ! ఉషాగా ఉన్నావ్..?



మళ్ళీ షేక్స్పియరే నటా!

దేవతకు ఆ వూరిలోని ఆడవారు ఓ వింత పద్ధతిలో పూజలు చేస్తారట. ఈ పూజలు వైశాఖమాసంలో జరుగుతాయట. ఆరోజు మొక్కుబడులున్న ఆడవారు ఉదయాన్నే లేచి, దిస మొలతో, వంటి మీద నూలుపోగైనా లేకుండా నదిలో స్నానం చేసి, దిగంబరులుగానే ఆ గుడిచుట్టూ అయిదు ప్రదక్షిణాలు చేసి, మొక్కు తీర్చుకుంటారట. ఈ మొక్కును సనాతనంగా వేశ్యలే మొక్కుకునేవారని, ఇపుడైనా ఇతర స్త్రీలుకూడా యీ మొక్కులో పాల్గొంటున్నారని నగర వాసులు వాపోతున్నారట. మొక్కులో పాల్గొనే స్త్రీలకు 20 నుంచి 30 లోపు వయస్సుంటుందట. ఈ వుత్సవాన్ని అరికట్టడానికి వూరు వూరంతా శతవిధాల ప్రయత్నించినా కుదరనే లేదట. ఈ కన్నుల పండుగను చూడడానికి దేశంలో అన్ని మూలలనుంచీ వుత్సాహవంతులు, ధనవంతులు వచ్చి మూగిపోతారట.

# ఒక వారం విపరీతం పాఠకుడు

## ఆకు మింగిన అతివ మరణం

వాణియానూరులో 29 ఏళ్ళ కొంజమ్మ అనే ఆమె చేతికి దొరికిన ఓ అడవి ఆకును నమిలి మింగిదట. వెంటనే మైకం వచ్చి విరుచుకుపడిపోతే ఆమెభర్త, తదితరులు ఆమెను ఆసుపత్రిలో చేర్చారట. డాక్టర్ల చికిత్సకు ఫలితం లేకుండా ఆమె ఆసుపత్రిలోనే చనిపోయిందట. ఆ ఆకు విషపూరితమైనదని డాక్టర్లు అనుమానిస్తున్నారట.

## వరుడు నచ్చని కారణంగా ఆత్మహత్య చేసుకున్న యువతి

బెంగుళూరు గాంధినగర్‌లో చామరాజ అనే అతను తన చెల్లెలు ప్రేమకు ఓ యువ సైనికున్ని వరుడుగా ఏరి తెచ్చాడట. ఆ కుర్రాడికి అమ్మాయి నచ్చినందు వల్ల వెంటనే పెళ్ళిని ఏర్పాట్లు చేయమన్నాడట. కానీ ప్రేమకు అతను సుతరాం నచ్చనందువల్ల మీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకు ఆత్మహత్య చేసుకున్నదట.

## అన్నీ ఉన్న కుటుంబం ఆత్మహత్య చేసుకోడానికి కారణం ?

పళని కొండ మీదున్న ఒక సత్రములో ఒకే కుటుంబానికి చెందిన నలుగురు చనిపోయి వున్నారట.. కుటుంబ పెద్ద 38 ఏళ్ళ పరమేశ్వరన్ ఆయన భార్య, ఇద్దరు పిల్లలు—అంతా విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నారట. 'మా చావుకి మేమే కారణం' అని రాసి పెట్టాడట పరమేశ్వరన్. ఈయన, యమ్మే ప్యాసయి, అనేక విమాన చోదకునిగా కొంత కాలం పనిచేసి, 15 సంవత్సరాలు ఉద్యోగానంతరం, ఈరోడ్డులో స్థిరపడి, ఇన్సూరెన్సు ఏజంటుగా పని చేస్తున్నారట. కెనడాలో ఓ వుద్యోగానికి కూడా యీయన ప్రయత్నం చేస్తున్నారట. జీవితంలో ఇన్ని సదుపాయాలుండీ కూడా యీయన యీ దారుణం ఎందుకు చేసినట్టోనని పోలీసు విచారిస్తోంది—ఇన్స్ డైర్యాటీ.

## నగలకోసం బాలికని చంపిన రూకలమ్మ

చిత్తూరుకు చెందిన మాదిరెడ్డిపల్లి అనే గ్రామంలో మొగిలిరెడ్డి అనే ఆయన ఆరేళ్ళ కూతురు ఒంటెడు నగలతో స్కూలుకు వెళ్ళిందట. ఆ నగలకు ఆశపడిన 25 ఏళ్ళ రూకలమ్మ అనే ఆమె ఆ పిల్లను మరిపించి, ఓ మామిడి తోటలోకి తీసుకువెళ్ళి అక్కడ పీక నులిపి చంపి, నగలన్నీ వొలుచుకుని, శవాన్ని ఒక మూలలో పారేసి పోయిందట.

## పత్రికలకెక్కని వార్త!

హైదరాబాదు హిందుస్థాన్ ఏరోనాటిక్స్‌లో లిల్లీ అనే ఆమె మేడ మెట్లు ఎక్కుతుండగా మధు అనేవ్యక్తి ఆమె చీర తొక్కాడట. చీర వేలను జీరాడుతున్నందు వల్ల పొరపాటున చూసుకోనందు వల్ల ఆమె చీర మీద కాలు పడివుంటాయని అనక అన్నారట. ఆ పరిస్థితిలో గమ్మున తలవంచుకుని, తన డిపార్టుమెంటు 'షెడ్డు నెంబరు 10'కి, వెళ్ళి పోయారట. ఆ అమ్మాయి ఆయన డిపార్టుమెంటుకు నేరుగా వెళ్ళి ఆఫీసరుల ఎదుట, 300 మంది వుద్యోగుల ఎదుట నడుమ చెప్పు తీసి ఆయన్ను కొట్టిందట. ఈ పనిని వారించబోయిన ఓ ఆఫీసరుకు కూడా ఆ దెబ్బలో వాటా తగిలిందట.. ఏ పేపరూ రాయని యీవార్త అబద్ధం కాదట.

## భాగవతం వింటున్న భక్తులపై విరుచుకుపడ్డ లారీ

పాలెయం అనే వూరికి చెందిన కొత్తపేటలో భాగవతం ఆట చూస్తున్న భక్తుల మీదికి 25 తేదీన తెలతెలవారుతుండగా ఓలారీ దూసుకొని పోయి, 64 మందిని నలిపి చంపి, పెక్కుమందిని గాయపరచిందట. చూపరులు తన్మయత్వంలో వుండడం వల్ల, లారీ రాకను గమనించలేనట ఈ దృశ్యాన్ని కళ్ళారా చూసిన ఓ వ్యక్తి అభిభత్సాన్ని వర్ణిస్తూ ఎముకలు, కపాలాలు, (శరీరాలు) లారీ క్రిందపడి విరిగిన శబ్దాలు పటపట అచుట్టుపక్కలంతా మారుమ్రోగాయని అన్నారట. ఈ చనిపోయిన వారిలో 22 మంది స్త్రీలు, 11 మంది పిల్లలు కూడా వున్నారట.



కృష్ణా! ఏమిటి నీ మహిమలు

## చిత్ర నిర్మాణ సంస్థపై పండిట్ రవిశంకర్ పరువు నష్టం దావా

హార్లాట్ (వేశ్య లేక లంజె) అనే ఇంగ్లీషు సినిమాలో ఒక అపఖ్యాతి అసభ్యకరమైన సెక్సుసన్నివేశంలో తన సంగీతాన్ని నేపథ్య సంగీతంగా వుపయోగించి తన పరువు తీసినందుకుగాను 25,00,000 దాలర్లు (1,87,50,000 రూపాయలు) ఆకంపెనీ తనకిచ్చి తీరాలని, అంతేగాక తనతో చెప్పా చేయకా తన సితారువాయిద్యాన్ని అట్టి అసభ్య సందర్భానికి వుపయోగించుకున్నందుకు గాను, తనకు ఒక మిలియను దాలర్లు (7.5 మిలియను రూపాయలు) నష్టపరిహారం యిచ్చి తీరాలని జగత్ ఖ్యాత సితారు విద్వాంసుడు పండిట్ రవిశంకర్ లాస్‌ఏంజలిస్‌లో అన్నారట. ఈ సినిమా తీసినది గ్రాఫెట్టి ఫిలిమ్స్ సంస్థట—గోవిందార్పణమస్తు.





ప్రతి చోటా అందాల సినిమా తారలు శుద్ధమైన సౌమ్యమైన లక్స్ గురించి ఏమంటున్నారో విన్నారా?

సినిమా తార జయలలిత ఏమందో వినండి

“లక్స్ నా లావణ్య పోషణ అత్యుత్తమంగా చేస్తుంది”

మీరు గూడా ఎవరో ఒకరికి దివ్యతారయేగా మీ లావణ్య పోషణను లక్స్‌నే చేయనివ్వండి

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-LTS.

## విషం — నిప్పు

ఢిల్లీ బ్రహ్మపురికి చెందిన అమీలాల్ అనే ఆయన తనకు భార్య, నలుగురు పిల్లలు వున్నారన్న విషయాన్ని దాచి, హర్‌ప్యారీ అనే ఆమెను వివాహం చేసుకున్నాడట. ఆమెకొక పిల్ల పుట్టాక భర్త విషయం తెలిసిందట. దాంతో వేరే గత్యంతరం లేదనుకున్న అమీలాల్ ఆమె మీద కిరసనాయిలు పోసి, నిప్పు అంటించి, చంపేశాడట.

## రెండేళ్ల తర్వాత బయటపడిన హత్య

పూనా కె. ఇ. యం. ఆసుపత్రిలో రిజిస్ట్రారు పని చేస్తున్న 27 ఏళ్ళ మన్‌కౌర్ అనే డాక్టరు నిర్మల్‌కుమార్ అనే వో కెప్టెన్‌తో ప్రేమాయణంలో పడిందట. నిర్మల్‌కుమార్ బ్రాహ్మణ పిల్లాడవడం వల్ల, తమ సిక్కు సాంప్రదాయ ప్రకారం ఆమె తలిదండ్రులు ఆ పెళ్ళికి వప్పలేదట. మిస్. మన్‌కౌర్ ఆసుపత్రి హాస్టలులో వుండేదట.

## ఒకవారం విపరీతం

ఒకనాడు (11—5—1969) ఆమె తల్లి 51 ఏళ్ళ జాల్‌కౌర్ ఆమెను మాయ చేసి, ఇంటికి తీసుకువచ్చిందట. ఇంటి వద్ద ఆమెను ఆమె తల్లి, తండ్రి, ఇద్దరన్నదమ్ములూ కలిసి చంపేశారట. తెల్లవారాక, 'మా అమ్మాయి గుండె ఆ రాత్రి చనిపోయిం'దని ఆమె పని చేస్తున్న ఆసుపత్రిలోని డాక్టర్లకు చెప్పి చావు సర్టిఫికేట్టు యివ్వమని జాల్‌కౌర్ కోరిందట. డాక్టరు ఆ పద్ధతిలో వ్వము నిరాకరించేసరి కామె పోలీసులను నమ్మ జూపిందట... నమ్మినట్టు నటించి, తమ పద్ధతిలో పరిశోధన జరిపి, రెండేళ్ళ అనంతరం అది హత్యగా నిరూపించి, డాక్టరు మన్‌కౌర్ తల్లిని, తండ్రి 62 ఏళ్ళ సేవా సింగ్ సైగల్‌ని, ఇద్దరన్నదమ్ములనూ అరెస్టు చేశారట పోలీసువారు.







తల నొప్పా?

అనాసిన్

నొప్పి నివారణకు మేలైనది. ఎందువలనంటే అది బలీయమైనది మరియు సురక్షితమైనది.

జలుబు మరియు ఫ్లూ వలన కలుగు నొప్పులకు, తలనొప్పి, నడుం నొప్పి, కండరాల నొప్పులకు మరియు పంటి నొప్పికి బాగా పనిచేస్తుంది.

అనాసిన్

భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పి నివారిణి



Regd. User of TM: Geoffrey Manners & Co., Ltd.

ALA3A



ఋతుక్రమం ఆలస్యమైతే?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన "దేవి పిల్సు" వాడండి

దేవి పిల్సు ముఖ్యంగా అలస్యమైన, క్రమముగాకాక పోయిన, బాధతోకూడిన, లేక ఆగిపోయినబహిష్టుకు దేవి పిల్సు బాగుగ గుణమిచ్చును




1 అన్నిసందర్భములందును శీఘ్రముగాను, అమోఘముగాను పనిచేయును ...
2 ఏస్థితిలోనును ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగింపదు

FULL COURSE 28 TABLETS Rs.11/-
HALF COURSE 14 TABLETS Rs.6.50

ప్రతిచోట దొరకును

Mfrs.: SEENU & Co., MADRAS-81

Available at all leading Chemists & Druggists.


## తప్పుకుంటే విషసర్పమైనా తనదారిని పోతుంది

ఎంతటి విషసర్పరాజమైనా, క్రూరాజేం ద మైనా తనంత తానుగా వచ్చి కాటు వేయదని పాములు పట్టడంలో ఖ్యాతి నార్జిం చిన ఆర్కాడే నిడ్యాల్‌కోవ్ అనె రష్యను వక్కాణించారట. తన శత్రువును చూపుమే దూరంలో కనుక్కొని పాము పడగ ఎత్తి బుస కొడ్తుందనీ, అప్పటికే తప్పుకో వాల్సిన వ్యక్తి తప్పుకో, కాటు వేటు దూరంలోనే వుండడంవల్ల ఆపాములు తప్పనిసరిగా కరుస్తున్నా యనీ ఆయన అన్నారట— విన్నారా!

## ఆకతాయి కుర్రాళ్లపై పనివారి ఆగ్రహం

ఢిల్లీ మయపురిలో నికెల్‌ప్లేటింగ్ ఫ్యాక్టరీకి చెందిన ఒక నీటి తొట్టిలో కొంతమంది కుర్రాళ్ళు యీత కొడుతుండగా ఆఫ్యాక్టరీవారు వారించారట. వారిమాటలను పెడచెవిన పెట్టి కుర్రాళ్ళు యీదుట తమజన్మహక్కు అనివారు వాదించే సరికి ఆఫ్యాక్టరీపనివారలో కొందరి కోపంవచ్చి ఆతొట్టెడు నీళ్ళలో బుడింగున ద్రావకం పోసేశారట. దాంతో ఆకుర్రాళ్ళువొళ్ళు కాలిపోయి ప్రమాద స్థితిలో ఆసుపత్రిలో వున్నారట.

## ఆవేశంలో తమ్ముని భార్య చేయి నరికిన అన్న

తంగలేరి గ్రామంలో మునుసామి అనే అతను తన తమ్ముని భార్య రాణితో వివాదానికి దిగి, ఆవేశంలో చేతికందిన కొడవలి తీసుకుని, ఆమె కుడి చెయ్యి నరికేశాడట. ఇతనికి చట్టం 9 నెలలు మాత్రమే కఠిన శిక్ష విధించిందట.

## పడవ ప్రమాదం

కృష్ణాజిల్లా దివి తాలూకా పిట్టల లంక వద్ద శేషయ్య పిల్లోడు నడుపుతున్న జాలరి పడవలో పదిహేను మంది ఎక్కి కృష్ణానదిని దాటబోయారట. నది మధ్య కెళ్ళిన పడవ ప్రవాహ వేగానికి తట్టుకోలేక తిరగబడిందిట. ఐదుగురు ఆడవారితో కలిసి మొత్తం ఆరుగురు చనిపోయారట. మిగతా వారు యీదుకొచ్చారట.

## ప్రమాదానికి గురియైన పెళ్ళివారి బస్సు

పెళ్ళివారిని తీసుకువెళ్తున్నబస్సొకటి బొంబాయికి 300 కిలోమీటర్ల దూరంలో మెలిగాన్ అనేచోట గతితప్పి, వంతెనను ఢీకొని, గిర్నా నదిలో బోర్లపోయిందట. తత్ఫలితంగా 8 మంది స్త్రీలు, 11 మంది పిల్లలతో సహా 38 మంది చనిపోయారట. 43 మంది తీవ్రంగా గాయపడ్డారట.

## రాక్షసత్వంలో మరో మెట్టు పైకి

తూర్పుపాకిస్తాన్‌లోని యుద్ధం రాక్షసత్వంలో మరో మెట్టు పైస్థాయికి చేరిందట. పాకిస్తాన్ యుద్ధ సైనికుల వద్ద యుద్ధ సామగ్రి తక్కువయిందువల్ల గ్రామాలను తగులబెట్టి ఆ గ్రామాలలో వున్న కాస్త పుష్టికరమైన వారినంతా ఒకచోట చేర్చి, రాక్షసుల్లాగ వారి నెత్తురు పీల్చి బయటకు తీసి, వారిని పిప్పిగా చేసి, బయట పారేస్తున్నారట.

## అరవై లక్షలమోసం—అంతా తమాషా!

ఢిల్లీ స్టేట్‌బ్యాంకుకు (పార్లమెంటు వీధి) 50ఏళ్ళ రుస్తుమ్ సొహరాబ్ అనె మాజీ సైన్యాధికారి 24 సోమవారం నాడు వెళ్ళారట వో వందరూపాయల చిల్లరకోసం. బ్యాంకంతా చూసాక ఆయనకో వింత కోరిక కలిగిందట. నేరుగా బయటకు వెళ్ళి ప్రధాని ఇందిరాగాంధిశ్రీ కటరీగొంతువంటి గొంతుపెట్టి ఒక టెలిఫోను నుంచి స్టేట్‌బ్యాంక్ హెడ్‌క్యాషియర్ మల్‌హోత్రాకు ఫోను చేశారట. ఆ ఫోనులో బంగ్లా దేశనిధికి ఇందిరాగాంధి వెంటనే అరవై లక్షల రూపాయలు బంగ్లాదేశనిధికి యివ్వమన్నారని ఆడబ్బు వేరుగా సాంకేతికం చెప్పిన ఒక వ్యక్తికి యివ్వవలెనని చెప్పాడట. క్యాషియరు మల్‌హోత్రా ఆరకంగా డబ్బు రసీదు లేకుండా బ్యాంకు నుంచి తీయకూడదనే సరికి, ఆ రుస్తుమ్ సొహరాబ్ 'అయితే ప్రధానితోనే మాట్లాడు' అని తాదే గొంతు మార్చి ప్రధానిననుసరిస్తూ ఆడబ్బు వెంటనే యివ్వమన్నారట. చిత్తం అనుకుంటూ మల్‌హోత్రా ఆడబ్బు పట్టుకుని బయటి వచ్చేసరికి రుస్తుమ్ సొహరాబ్ తానే ఆ వ్యక్తినని చెప్పి అరవై లక్షలూ తీసుకుని వో టాక్సీఎక్కి అది దిగి ఇంకోటి ఎక్కి, యీ రకంగా 18 టాక్సీలు మారి స్విమిత పడేలోగా పోలీసులు వచ్చి పట్టేస్తే ఇదంతా తమాషా అన్నారటాయన. అనుమానం లేకుండా ప్రధానిపేరు వినగానే, ఇట్టే విదేయుడవి 60 లక్షలు మూట కట్టిచ్చిన హెడ్ క్యాషియర్ ఆయన్ని సిగనలా, ప్రధాని కార్యాలయానికి విషయం తెలియ జేస్తే వారు తమకు ఏమీ తెలియ న్నారట. దాంతో ఆయన భయపడి యీ విషయాన్ని వెల్లడి చేశారట.

## నష్టపరిహారంకోసం దావావేసిన వ్యోమిగామి భార్య

1967లో చంద్రమండలాని వెళ్ళిన వ్యోమగామిలో ఆక్సిజను పేలుడువల్ల తన భర్త మరణించిన కారణాన్న తనకా సంస్థవార నష్టపరిహారంగా 5 మిలియను డాలర్లు యిచ్చి తీరాలని వర్జిల్‌గారి జస్ భార్య లాస్‌ఏంజలిస్ కోర్టులో మే 26వతేదీన వో దావావడేసిందట. ఆవ్యోమగామి వలం విజ్ఞాన వేత్తల అజాగ్రత్తకు ఫలితమని కూడా ఆమె అన్నదట.

## భయంకరంగా పరిణమించిన భూమి తగాదా

చిత్తూరుజిలా బంగారుపాలెం తాలూకాకు చెందిన ఒక గ్రామంలో భాస్కరరెడ్డి అనె అతనికీ, అతనితమ్ముడు రాములు రెడ్డికి భూమి విషయంలో మన్వెంతం కే యూ హావమచ్చే అనుకునేంతటి తగాదా వచ్చాయట. దీని నివారణమార్గం ఆలోచించిన భాస్కరరెడ్డి, ఆయన భార్య గోకులమ్మ చేరి పొలంలో వంటరిగా వున్న రాములురెడ్డిని భయంకరంగా కొట్టి చంపేశారట.


గెలవండి రు. 15,000

ఎంట్రీ 1కి రు. 1—00.

6 ఎంట్రీలుకు ఒక ఎంట్రీ ఉచితం.

# విజ్ఞానవినోద్ కార్పొరేషన్ (రిజిష్టర్డ్)

4—27—5, చిట్టినగర్, విజయవాడ—1. (A.P.)

ఆల్ కరెక్టు రు. 10,000

ఒక తప్పు రు. 3,000

రెండు తప్పులు రు. 2,000

(సుప్రీంకోర్టు తీర్పు ననుసరించి నడుపుచున్న సాహిత్య పోటీ)

ముగింపు తేది:— 15—7—71. కీ పోల్యూషన్ ది. 19—7—71 ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి దినపత్రికలలో ప్రకటింపబడును.

**ఆధారములు :—**

1. గౌతమబుద్ధుడు అహింసావాది / అవతార పురుషుడు.
2. గాంధి మహాత్ముడు అస్పృశ్యతా నివారణకు / భారత దేశ స్వాతంత్ర్యమునకు పాటుపడెను.
3. వేసవిలో మల్లెలు / మామిడిపండ్లు పుష్కలంగా లభించును.
4. వ్యాపారస్తుని వివేకము / మూలధనము వ్యాపారాభివృద్ధికి తోడ్పడును.
5. ప్రభుత్వం ప్రజలను శత్రువులనుండి / అంటురోగములనుండి కాపాడును.
6. మనదేశ ప్రజలు చాలా మంది నిరుద్యోగము / పన్నుల భారముతో బాధపడుచున్నారు.
7. భగవంతుని ఐక్యమునకు భక్తి / ముక్తి ప్రధానము.
8. చోదకుడు మ్యము చేరుటకు ఏకాగ్రత / దృఢ నిశ్చయము అవసరము.
9. ఆరోగ్యము గల పసి పాపలు ముద్దుగా / బొద్దుగా వుందురు.
10. విలాసములకు కారణము ఐశ్వర్యము / ఆనందము.
11. దేశ సౌభాగ్యము నాయకులు / ప్రజలుపై ఆధారపడియుండును.
12. శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతి / గోపికా లోలుడు.
13. విద్యవలన వివేకము / విజ్ఞానము వృద్ధి పొందును.
14. వివేకానందుడు మత బోధకుడు / బ్రహ్మచారి.

**నిబంధనలు :—** తెల్లకాగితముపై పదములు వ్రాసి ఒక్కరు ఎన్ని ఎంట్రీ లైనను పంపవచ్చును. కూపనుతో ఎమ్. ఒ. రశీదును లేక క్రాసుచేయని పి. ఒ. లను జతచేసి పంపవలెను. ప్రతి క్కరు ఎన్ని బహుమతులైనను గెల్వవచును. ఒకరికంటే ఎక్కువ విజేతలున్న బహుమతి మొత్తమును సమానముగా పంచబడును. మేనేజిమెంటు వారిదే తుది నిర్ణయము. దావాలేవీలు విజయవాడ కోర్టులలో పరిష్కరింపబడును. రంగుంత(త్రి) వాడిన పదమే సరియైనది. ఆక్షేపణలున్నచో ఫలితములు ప్రకటించిన 10 రోజులలోగా రు 10/— (పదిరూపాయలు) పంపుతూ మాకు తెలియపర్చవలెను. ఆక్షేపణలు విజయముకానిచో రు. 10/— లు కోల్పోవుదురు. ముగింపు తేదినాడు గాడ ఎంట్రీలును ఎక్స్‌ప్రెస్ డెలివరి పోస్టులో పంపవచ్చును. జేతల లిస్టు, తదుపరి ఎంట్రీ ఫారములకు తమ అడ్రసు కల పోస్టల్ కవరును పంపించవలెను. మీ ఎంట్రీలు మనియార్డర్లు యీ క్రింది అడ్రసుకు పంపగోర్తాము.

విజ్ఞాన వినోద్ కార్పొరేషన్, 4-27-5, చిట్టినగర్, విజయవాడ—1.



# దోయా తీన్

శ్రీమతి రాధారాఘవ్

చలిగాలికి చేతులు గడ్డ కట్టేస్తూంటే, త్వరత్వరగా పనులు ముగించుకుని, లాన్‌లో కుర్చీ వేసుక్కూర్చున్నాను.

పుస్తకాలబ్బాయి వీక్లీలు తెచ్చిచ్చాడు.

శీతాకాలం కావడంవల్ల ఎండలో వెచ్చదనంకంటే చల్లదనమే ఎక్కువగా ఉంది. కాశ్మీర్ షాల్ మరింత దగ్గరకు లాక్కుని, ఒకోపేజీ తిరగేస్తున్నాను.

ఇంతలో ఎక్కడ్నించి వచ్చాడో? లోవర్ కె. జి. చదువుతోన్న మా అబ్బాయి అమ్మా! అమ్మా! అంటూ పరుగెత్తుకొచ్చాడు.

'ఏమిట్రా' అన్నాను పుస్తకంలోంచి కళ్లు తిప్పకుండానే.

'నీతో చెప్పడం మర్చిపోయా. మా స్కూలు గోడమీదేం దో యా తీన్ బచ్చే అని వ్రాశారు. మేము నలుగురం పిల్లలం గదూ? ఇద్దరం మాయం అయిపోమా?' అనడిగాడు పుస్తకంలోంచి నా ముఖాన్ని పైకెత్తుతూ.

అనుకోని ప్రశ్నకు ఒక్కక్షణం తెల్లబోయాను.

'నీకెలా తెలును? నువ్వు చదవగల్గావా?' అనడిగాను తేరుకుని.

'హో. రెడ్ ట్రయాంగిల్!!!—వేనన్నమాటేం? మా స్కూలు పిల్లలందరం గట్టిగా అరుచుకుంటూ చదివేశాం. స్కూలు బస్‌మీద వెళ్తూంటే కనిపిస్తుంది' అన్నాడు పెద్ద గొప్పగా కళ్ళు తిప్పుతూ.

'నిజమేనమ్మా. 'కన్ సంతాన్; సుఖీ యింసాన్' అనికూడ వ్రాశారు. అంటే—యిద్దరే పిల్లలైతే యింకా హాయిగా ఉండొచ్చునట. మాలో యిద్దర్ని హాష్. మాయమంత్రం చేసేయకూడదూ?' అన్నాడు యింకొంచెం పైక్లాసు చదువుతోన్న మా పెద్దబ్బాయి.

అప్రయత్నంగా నా ఆలోచనలు కొన్ని సంవత్సరాల ముందుకు పరుగులెత్తాయి.

వేసవి శలవుల్లో బొంబాయినుంచి అన్నయ్యా, వదినా వచ్చారు.

వాళ్ళకు యిద్దరబ్బాయిలు. ఇద్దరూ తెల్లగా, ఆరోగ్యంగా ఉంటారు, ముద్దొస్తూ. కాన్వెంట్లో చదువుతూండడంవల్ల ఇంగ్లీషు బాగా మాట్లాడ్తారు.

శలవులు కావడంవల్ల, ఆ వేళ నా ఫ్రెండ్సు కొందరు మా యింటికి వచ్చారు. అందరూ పిల్లల చుట్టూ చేరారు, కబుర్లు చెప్పిస్తూ, ఇంగ్లీషు పద్యాలు చెప్పిస్తూను.

'ఆంటీ! మా కాన్వెంట్లో స్కూలు డేకి మేమిద్దరం మోనో ఏక్టు ప్లే ఏక్టుచేశాం, అందరూ తెగ మెచ్చుకున్నారు' అన్నాడు—అన్నయ్యగారి పెద్దాడు.

'మరి మాకూ చూపించండి' అన్నారు అందరూ.

'హో. కె.' అంటూ యిద్దరూ నిమిషాల

[illegible] క్రిందకు దిగి వెళ్ళి, [illegible] [illegible] పెండెట్స్, వది నిమిషాల్లో తయారయి వచ్చారు.

పెద్దాడు మిలిటరీ డ్రెస్ వేసుకున్నాడు. చిన్నోడు గౌను, నెత్తిమీద టోపీతో— అసలే తెలుపేమో — నిజంగా దొరసానిలానే ఉన్నాడు.

వదినకు ఆడపిల్లల్లేనందువల్ల, వాడిని స్కూలుకి పంపేదాకా గౌనులేసి, ఆడపిల్ల ముస్తాబు చేస్తూండేది.

సోల్జియర్ తుపాకీతో హుందాగా అటూ యిటూ నడుస్తూంటాడు ఠీవిగా. అక్కడికో అందమైన అమ్మాయి వస్తుంది.

'సోల్జియర్! సోల్జియర్! విల్ యు మేరీ మి, విత్ షైప్స్ అండ్ డ్రమ్స్ ?' అనడుగుతుంది అతన్ని. (బ్యాండు మేళాలతో నన్ను పెళ్లి చేసుకుంటావా ?' అనడుగు తుంది.)

'హో మై ప్రెట్టీ మెయిడ్! ఐ కాంట్ మేరీ యూ బికాజ్ ఐ హేవ్ నో షూస్' అంటాడు ఆ అబ్బాయి. (నేను, నిన్ను పెళ్ళి చేసుకోలేను, ఎందుకంటే నాకు జోళ్ళు లేవు అంటాడు.)

అప్పుడా అమ్మాయి మార్కెట్టు కెళ్ళి, అతనికి మంచి బూట్లు తెచ్చిస్తుంది.

అప్పుడు మళ్ళీ అడుగుతుంది — 'సోల్జి యర్ ! సోల్జియర్ ! ఇప్పుడు నన్ను పెళ్ళి చేసుకుంటావా?' అని.

'నాకు కోటు లేదు. అందుకు నిన్ను నేను చేసుకోలే నమ్మాయ్!' అంటాడా అబ్బాయి.

పాపం! ఆ అమ్మాయి మళ్ళీ త్వర త్వరగా బజారుకి పరుగెత్తుకెళ్ళి కోటు కొని తెస్తుంది.

'ఇప్పుడు చేసుకుంటావా? పెళ్ళి' అన డుగుతుంది.

'ఐహేవ్ నో కోట్, అందుకు నిన్ను చేసుకోలేను' అంటాడా అబ్బాయి.

పాపం! ఆ అమ్మాయి మళ్ళీ బజారుకి పరుగెత్తి కోటు కొనితెస్తుంది,

'ఇప్పుడు చేసుకుంటావా ? సోల్జియర్! నన్ను పెళ్ళి?' అనడుగుతుంది.

'హో మై ప్రెట్టీ మెయిడ్! ఐ కాంట్ మేరీ యూ బికాజ్ ఐ హేవ్ ఎ వైఫ్ ఎట్ హోమ్, (నాకు యింటిదగ్గరొక పెళ్ళాం ఉంది. అందుకు నిన్ను పెళ్ళిచేసుకోలేను) అంటాడా అబ్బాయి.

# దో యా తీన్

అప్పుడు పాపం ఆ అమ్మాయి హీ హీ అంటూ ఏడుస్తూ, కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోతుంది.

అందరం నవ్వలేక చచ్చాం.

అందులోనూ వాడికి ధైర్యం ఎక్కువేమో, సోల్జియర్‌లా నడకేకాక మాటలు కూడ ధైర్యంగా అంటూ ఏక్టు చేసాడు.

చిన్నవాడుకూడ వాడికంటే ఏం తీసిపో లేదు.

రెండుచేతులతో గౌను రెండు చివరలా, విశనక్కరలా సాగదీసి పట్టుకుని, చిరుపాదా లతో డ్యాన్సు చేస్తున్నట్టు నడుస్తూ వెళ్ళడం— ఆ ఏక్షను చూస్తే భలే సరదా అనిపించింది.

అన్నిటికంటే, ఆ అమ్మాయితో యివి లేవు, అవిలేవు అని అన్నీ తెప్పించుకుని — చల్లగా చెప్పాడు ఆఖర్ని. 'ఇంటిదగ్గర నాకో పెళ్ళాం ఉంది. నిన్ను పెళ్ళిచేసుకోలేనని.'

అందరూ ఆగకుండా చాలాసేపు క్లాప్స్ చేసేశారు.

## సాయి ప్రణతి

శ్రీ షిర్డి సాయి నమస్తుభ్యం
వరదే భక్తజన రక్షకం
ద్వారకామాయి నివాసం
కరుణా మానసం నమామ్యహం.

భజేహం సాయి రూపం
భజేహం సాయినామం
భజేహం నవనీత మానసం
భజేహం భవ భయహరం.

సాయి రూపం శోకనాశనం
సాయినామం పరమ పావనం
సాయి దర్శనం సంకటహరం
సాయి ధ్యానం ఘోర పాపహరం.

భక్తజన మానస విహారం
భక్తి, రక్తి, జీవన్ముక్తి సాయినామం
కాంతి పుంజం సాయిభజనం
శాంతి ధామం సాయి ఆలయం
సాయిరామం రక్షమాం. రక్షమాం.
సాయిరామం పాహిమాం. పాహిమాం.

—'కొలనుపాక'

'[illegible] [illegible] [illegible]' అంది [illegible].

'మీ అన్నయ్యగార్కి పిల్లిద్దరేనా?' అడి గింది కమల.

'ఐస్. అంతే. అన్నయ్య ఆపరేషను చేయించేసుకున్నారు' అన్నాను.

'మరి ఆడపిల్ల ఒద్దా?' అన్నారెవరో.

'వదినకు వాళ్ళమ్మగారి ఆనవాయితీ అట. వరసగా నలుగురు మగపిల్లలు పుడితే గాని, ఆడపిల్ల పుట్టదట. అదీ భయం' అన్నాను నవ్వుతూ.

'ఎలాగా చదువుకున్నవాళ్ళు చదువుకున్న వాళ్ళే. అందుకూ ప్లానింగు' అంది మరో అమ్మాయి.

'మనవైపుకంటే నార్త్‌లో నివసిస్తున్న వాళ్ళు ఎక్కువ స్ట్రిక్టుగా ఉంటున్నట్టు న్నారీ విషయంలో' అంది సీత.

'అవును. నిజమే. అదే మన వాళ్ళయి తేనా?—ఏ ఏడుగురమ్మాయిలనో కనేసి, ఇంకా అబ్బాయి కలగలేదనో, లేకపోతే వరస పెట్టి అబ్బాయిలను కనేస్తూ, అచ్చటా ముచ్చటా తీరడానికి ఆడపిల్లలేదని ఎదురు చూస్తూనో, అంతగా లేకపోతే ఒక్కడే అయిపోయాడు తోడు లేదనో కనేస్తూండే వారు' అంది మరో అమ్మాయి.

'అవునవును. ఈ నేస్తూండేవారు కదూ' అంది పద్మ నవ్వుతూ.

'రేపు నువ్వూ అలాగే యీనేద్దువుగాని' అన్నారెవరో.

'నేనా??? హు !!! 'గంగిగోవుపాలు గంటెడైన చాలు' అన్నారు. మనం అంతా లెక్కంటే లెక్కే. పదిమందిని కని గాలి కొదిలేసేకంటే, నలుగురితో ఔననిపించు కునే పిల్లలు యిద్దరు చాలు. తెలిసిందా?' అంది కళ్ళెగరేస్తూ— పిల్లల్నిద్దర్నీ దగ్గ రకు తీసుకుని.

'అదీ ఒక ఘనకార్యమే నేమిటి? ఇద్ద రితో ఆపేస్తే, అందులో ఏ ఒక్కరైనా చస్తే???' ఫెడీమని అడిగింది మా ప్రక్కింటి వారమ్మాయి.

చెళ్ళున చరిచినట్టయి అందరం తెల్ల బోయి చూశాం.

—వచ్చి ఎంతసేపయిందో, మా టల ధోరణిలో ఎవరం గమనించలేదు.

'అవును. మా బంధువుల్లో ఒకరి యిద్దరు పిల్లలు పుట్టగానే ఆపరేషను


పర్యాయములు సిరి
సంతసాలు సారి
దావణగెరె
'టెరీన్'/కాటన్ బట్టలలో
ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్ - సాంప్రదాయముగా సమకాలిక సౌందర్యమును సమకూర్చును

చేయించేసుకున్నారు. మశూచికం వచ్చి ఒకరి తర్వాత ఒకరు యిద్దరూ పోయారు. ఇప్పుడేమో అన్నారు కంగారుపడి చేయించేసుకున్నా మని' అంది తడుముకోకుండా.

మా ప్రక్కింటాయనకు పిల్లలు చాలా మందే ఉన్నారు. ఏటా పిల్లలతో, అందులోనూ మధ్య మధ్య కవలలతో తులతూగుతూ ఉంటుందావిడ. వాళ్లింటి కెళ్లేసరికి, ఉచ్చలకంపు గుప్పున కొడుతుంది. అక్కడ పట్టుమని పదినిమిషాలు నిలబడలేం. పిల్లలెప్పుడు చూసినా, మురికోడుతూ, చదువు ఒంటబట్టక ముడికబుర్లు చెప్తూంటారు. దేన్నిచూసినా తిండికి ముఖం వాచినట్టు ఎగబడతారు. బిలబిల్లాడుతూ కనిపించే ఆ పిల్లలను చూసినప్పుడల్లా 'కమ్ సంతాన్ సుఖీ యింసాన్' అన్నమాట జ్ఞాపకం వస్తూంటుంది.

విజమే శక్తికిమించి యిల్లు, ఒల్లు గుల్లచేసుకునే కంటే యిదే మంచిది అని పిస్తూంటుంది.

—ఆ పిల్ల అందరిలోకీ పెద్దది యీ అమ్మాయి. ఎప్పుడొచ్చి మాతో కలిసిందో ఎవరం చూడేలేదు. మేము మామూలు ధోరణిలో మాట్లాడేసిన మాటలు ఆ అమ్మాయిని భుజాలు తడుముకునేలా చేసి నట్టున్నాయ్!— లేకపోతే ఆ అమ్మాయినే హేళన చేస్తున్నా రనుకుందో—

—అందుకే వెనుకముందు లాలోచించకుండా, ఫెడీమని లెంపకాయ కొట్టినట్టు అనేసింది.

మేమందరం వెర్రిముఖా లేయడం గమ

# దో యా తీన్

నించి అంది.

'అవును. అదీ గొప్పేనేమిటి ? ఆపరేషన్ చేయించుకున్నవాళ్ళంటే మా నాన్నగార్కి అసహ్యం. భగవంతు డిచ్చినవాళ్లను పుట్టకుండా ఆపేయడం మహా పాపమట. ఒకరకంగా అదీ హత్యలాంటిదే నట.'

కొన్ని క్షణాలదాకా అందరం నిశ్శబ్దంగా ఉండిపోయాం. ఆ అమ్మాయి మాటలతో అందరూ ఏదోలా అయిపోయారు. ముందున్న ఉత్సాహం, సరదా అన్నీ పాలపొంగుమీద నీటి చిలకరింపులా అణిగిపోయాయి.

ఆ పిల్లమాటలు నాలో తెలీని ఆందోళనని కల్పించాయి. 'భగవంతుడా! ఈ పిల్లను చల్లగా చూడు' అని మనస్సులోనే దేవుడికి దణ్ణం పెట్టుకున్నాను.

లోపల నేను బాధపడుతున్నట్టే, అందరూ మనసుల్లో బాధ పడుతున్నారని వాళ్ల ముఖాలు చూస్తేనే తెలిసిపోతోంది.

'ఇద్దరే పిల్లలైతే ...... అందులో ఏ ఒక్కరైనా చస్తే ?'...ఇదే మాట నిమిష నిమిషానికీ గింగుర్లు పెడుతోంది.

పోనీ ఆ అమ్మాయి—అన్నమాటా సరే అనుకుందామన్నా, పదిమందీ పుట్టాక, కర్మంచాలక, ఏ తల్లో తండ్రో చస్తే ?

—పదే పదే నాలిక చివరిదాకా వచ్చిన మాటల్ని నాలో ఉన్న అంతరాత్మ అణగ ద్రొక్కేసింది.

విజమే. భగవంతుడు చల్లగా చూడాలే గాని, ఆయన కటాక్షవీక్షణాలు మనమీద ప్రసరించినంతసేపూ ఫరవాలేదు— లెక్కగా పిల్లలను కని, వాళ్లకేమైనా అనర్థం జరిగినా బాధే; పెంచి పెద్దచేసే తల్లికేం జరిగినా నష్టమే.

ఆ శలవుల్లోనే మా ఫ్రెండ్సులో చాలా మందికి, పెళ్ళిళ్ళయి వెళ్లిపోయాము. మా ప్రక్కింటి వారమ్మాయి పార్వతికి మాత్రం యింకా పెళ్లి కాలేదు. ఆ సమయంలో ఆ పిల్ల తండ్రి బాగానే సంపాదిస్తూండడంవల్ల, మంచి కట్నం యిచ్చే పెళ్ళి చేద్దామని వాళ్ళు చాలా ప్రయత్నాలు చేశారు.

కాని ఆ అమ్మాయి ఒకపట్టాన దేన్నీ అంగీకరించేది కాదు వచ్చిన ప్రతిసంబంధాన్నీ ఏదో ఒక వంకపెట్టి వెళ్లగొడుతూండేది.

శ్రీవారు ఉద్యోగరీత్యా దూరాన ఉండడం వల్ల, మళ్ళీ చాలారోజులకిగాని యింటికి రావడానికి వీలయింది కాదు నాకు.

ఆ వేళ రాత్రి నిశ్శబ్దంలో ప్రక్కింటి మంచి ఏడుపులు వినిపించాయి.

గుండె ఝల్లుమంది. 'ఏమిటి?—ఎవరి కేమయిందో?' అన్నాను లేచి కూర్చుంటూ.

'నీకు తెలీదా ? పార్వతి వాళ్లనాన్నగారు పోయారు పాపం. అప్పుడే రెండు మూడు నెలలయిపోయింది' అంది అమ్మ.

గుండె లొక్కసారి ఎవరో పిండినట్టుయింది.— బిలబిల్లాడుతూ, యిల్లంతా నిండిపోయి ఉన్న పిల్లలు, వారిమధ్య ముడి కబుర్లు చెపుతూ, అతిశయంగా మాట్లాడే పార్వతి ముఖం ఒక్కసారి గిర్రున తిరిగాయి.

అయ్యో! పాపం! అనిపించింది. 'ఏమయింది? అసలు ఎలాపోయారు?' అడిగాను అమ్మని.

'అంతా అనుకోకుండానే అయిపోయింది. ఏదో విషజ్వరం వచ్చి నాలుగు రోజుల్లో కన్నుమూశారాయన. ...గంపెడు పిల్లలతో సంసారం యికముందు ఎలా సాగుతుందో ఏమో ? ... ఆవిడ ఒకటేగోల. పాపం! ఆవిడను పట్టడం కష్టమైపోతోంది.' అంటూ నిట్టూర్చింది అమ్మ.

నేను అక్కడున్న రోజుల్లోనే పార్వతి పెళ్లి జరిగిపోయింది. తండ్రిపోయిన ఏడాదిలో చేసేస్తే, కన్యాదాన ఫలం దక్కుతుందట — అదీగాక ఏ ఒక్కపిల్ల తగ్గినా ఆ తల్లికి కొంతభారం తగ్గినట్టేగాదా?

వరుడు రెండవ పెళ్ళివాడు. కొంచెం తప్పున్నవాడేనట. కాని బాగా ముసలివాడు— ఈ [illegible]



— ఒకరొకరిగా ఆ అమ్మాయి [illegible] తోటే జరుగుతోందని విన్న నేను ఎంతో ఆశ్చర్యపోయాను. — ఒకరికి మంచి ఉద్యోగం కాదని, యింకొకరికి డబ్బు దిక్కులేదని, మరొకరికి అందం వచ్చలేదని — ఎన్నో వంకలుపెడ్తూ వెళ్ళగొట్టిన పార్వతేనా ? యీ పార్వతి అనిపించింది.

పెళ్ళి ఆ ఊళ్ళోనే గుడిలో జరిగింది. పెళ్ళికి తరలివెళ్తూన్నప్పుడు ఆ యింట్లో వాళ్ళ దుఃఖం చూడలేకపోయాం.

అదే తండ్రి బ్రతికుంటే, ఆ పెళ్ళి ఎంత వైభవంగా జరుగును ? ఇప్పుడు మిలిన డబ్బుతోటే యింతమంది పిల్లల జీవితాలు, చదువులు, పెళ్ళిళ్ళు పేరంటాలు అన్నీ వెళ్ళమారాలిగదా ?

'ఆఖరికి నీ బ్రతుకిలా అయిపోయింది గదా తల్లీ!' అంటూ అయినవాళ్ళంతా ఆ అమ్మాయిని పట్టుకు ఏడుస్తూంటే, అందరి కళ్ళు చమర్చాయి. కాని పార్వతిమాత్రం నిర్లిప్తతగా చూస్తూండిపోయింది.

'మహా మొండిపిల్ల! నదురూ బెదురూ లేదు చూడు' అనుకుంటున్నారెవరో, వెనక నుంచి.

కాని ఆ చూపుల్లో, — ఆ హృదయపు లోతుల్లోకి, తొంగి చూడగల్గిన వారికి మాత్రం యీ ప్రపంచంలో ఆ అమ్మాయి పోగొట్టుకున్నదెంతో స్పష్టంగా తెలిసిపోతోంది.

'ఇద్దరితో ఆపేస్తే ? — అందులో ఒకరు చస్తే ?'— ఆ అమ్మాయి మాటలు యింకా నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి.

నిజమే. ఇలా అనుకుని వెనుక ముందులు చూడకుండా యిలా కనేస్తే మాత్రం యిప్పుడేమయింది?

— ఈ ప్రపంచంలోకి యింతమంది పిల్లల్ని తీసుకొచ్చి, ఆయన తప్పుకున్నాడు. పాపం! వాళ్ళ బ్రతుకులు వీధిన పడ్డాయి.

'ఏం అమ్మా! మాట్లాడవేం ? మేం యిద్దరం ఖతమ్ అయిపోమా ?' అనడుగుతున్నాడు మా అబ్బాయి నన్ను పట్టుకు ఊపుతూ.

దోయా తీన్ బచ్చా అన్నప్పుడల్లా యీ సంఘటన కంటి ముందు మెదులుతూంటుంది.

'ఒద్దు. ఒద్దు. నువ్వులేకుండా నేనుండగలనా? — అలాంటి మాటలు మాట్లాడకూడదు' అంటూ దగ్గరకు తీసుకున్నాను. ●





ఎంత అద్భుతం! ఉల్లాసకరమైన పామొలివ డీ-లక్స్‌తో రోజంతా మీరు తాజాగా ఉండవచ్చు. గంటల తరబడి, సువాసనలు వెదజల్లుతూ, చల్లగా నెమ్మ లేనంత తాజాగా మిమ్మలనుంచుట కొరకై, 17 వినూత్న పరిమళాలు సమ్మిళితం చేయబడిన దివ్యమైన టాల్కు, మీ చక్కదనానికి మెరుగు దిద్దుటకై ప్రత్యేకంగా తయారుచేయబడింది.

**పామొలివ్ డీ-లక్స్ టాల్కు**
**వాడి చూడండి ఈనాడే!**







పామొలివ్ లవెండర్ టాల్కు — లవండర్ యొక్క విశిష్ట వికాసం!



# 71-72 బడ్జెట్


ఈసి సం॥ బట్టలుతికే సబ్బుతోనే
ఒళ్లు రుద్దుకునేట్టుగా ఒప్పందం
చేసుకున్నాం మాఇంట్లో!


మీరు నా జీతం పెంచాలి బాస్,
కాస్మోటిక్స్ ధరలు పెరిగాయిమరి!


విదేశయాత్రలకు
బయలుదేరుతున్నా
నని చెప్పి
మానేశారేం?


నాకు నీ మీద ప్రేమ అరవీశం కూడా
తగ్గలేదు రాణీ!
రేట్లు పెరగడం
మూలాన ఉత్తరాలు
ఎక్కువ
రాయడం
తగ్గించా
నంతే!


ఇదువరకి
స్కూటర్ మీద షికారు
తీసుకెళ్లేవారు -
ఇప్పుడు నడిచి
వెళదామంటారేం!
పెట్రోలు
ప్రియమైంది
ప్రియా!






**జరిగిన కథ**

పార్వతికి అందమయిన రాజారావుతో పెండ్లవుతుంది. బొంబాయిలో వుంటున్న రాజారావు పార్వతిని కట్నంమీది మోజుతోనే చేసుకుంటాడు. రిసెప్షన్‌కి వచ్చిన రాజాస్నేహితుడు మధుని పార్వతి నిరాడంబరత, సౌమ్యత బాగా ఆకర్షించాయి. మధు చెల్లి రేణుక. సంఘసేవంటే ఆమెకి చాలా యిష్టం. నాయకురాలిలాంటి నాగమ్మ రాజా తల్లి. ఆమెకి కొడుకే ప్రాణం. నాపురానికి వెళ్లిన కొద్దిరోజులకే రాజారావు పైలావచ్చీనువాడని తెలిసి పార్వతి బాధపడుతుంది. రేణుక పార్వతికి ధైర్యం చెప్పింది. రాజాని వలలో వేసుకుని కోలా ఆతనిదగ్గర డబ్బంతా లాక్కుంది. రేణుక రాజారావు ప్రవర్తన గురించి చెప్పి పార్వతిని ఉద్యోగం చెయ్యమని ప్రోద్బలం చేస్తుంది.

## 6

పార్వతి ఇంటికి వచ్చేసరికి రాజారావు నాగమ్మ కాఫీ తాగుతున్నారు. రేణుకని చూసి ఎదురుకి వచ్చాడు రాజా. రేణుక కారు దిగలేదు.

'నమస్కారం రేణుకా! రాండి లోపలికి' అతి మర్యాద చూపుతూ ఆహ్వానించాడు.

'లేదండీ, వెళ్ళాలి. అన్నయ్య ఎదురు చూస్తూ వుంటాడు. ఇదిగో మీ భార్య... జాగ్రత్తగా అప్పచెప్తున్నాను. సరేనా?' నవ్వుతూ అంది రేణుక.

నవ్వుతూ 'మీతో వెళితే తప్పేపోదు లెండి' అన్నాడు.

వెళ్లిపోయింది రేణుక.

* * *

రాత్రి భోజనాలదగ్గర ... పార్వతి వడ్డిస్తోంది. తల్లీ కొడుకులు భోంచేస్తున్నారు.

'ఒరేయ్ అబ్బాయ్! నో వందరూపాయలు నా చేతికివ్వరా వాళ్లొస్తున్నారు కూడా, కావలసిన వస్తువులు కొనాలి.'

'అలాగే నమ్మా, రేపిస్తాను.'

'ఎవరొస్తున్నారు ?' మాట కలిపింది పార్వతి.

'నీ ఆడపడుచు, కావేరి, నా తమ్ముడు రంగనాథం... సరేనా... అయినా నీకెందుకీ గొడవలన్నీ.'

'ఎప్పుడొస్తారు?' మళ్లీ ప్రశ్న వేసింది పార్వతి.

'రేపాదివారం. ఒరే స్టేషన్‌కి కూడా వెళ్ళాలిరా. మువ్వా రోజా ఎక్కడికీ పోకూడదు.'

'సరేనమ్మా, నాకూ ఆరోజు పనేం లేదు.'

చేతిలో డబ్బు లేకపోతే ఒకరోజు ఎక్కడికీ వెళ్ళడు అతను.

వాళ్లిద్దరి భోజనాలు అయ్యాక పార్వతి భోంచేసి వంటిల్లు సర్ది హాలిట్లోకి వచ్చింది.

తల్లి కొడుకు కలిసి తాంబూలం వేసుకుని పేకాట ఆడుకుంటున్నారు. తనూ వెళ్ళి అక్కడ కూర్చుంది. పార్వతిని గమనించలేదు వాళ్ళిద్దరూ.

వాళ్ళని రెండాటలు ఆడనిచ్చి పార్వతి రాజారావుతో అంది 'మీతో మాట్లాడాలి.'

తలెత్తి చూశాడతను.

'నాతోనా? ఏం మాటలు? చెప్పు.'

పార్వతి నాగమ్మ వైపు చూచింది.

'నేనుంటే చెప్పకూడదేమోరా. నే వెళ్తాలే. మీ రిద్దరూ సరసంగా కబుర్లు చెప్పుకోండి' అంది నాగమ్మ మొహం ఎర్ర చేసుకుని. అందేగానీ లేచే ప్రయత్నమేమీ చెయ్యలేదు.

'అదేమిటమ్మా. నువ్వుండు. ఏం? నువ్వుంటే ఎందుకు చెప్పదు? నీకు తెలివి రహస్యాలు మాకేం లేవు. చెప్పరాణి.' అన్నాడు రాజా నాగమ్మ వైపుకి జరిగి.

తల్లివైపు ప్రేమగా చూస్తూ ఆవిడ దగ్గరగా జరుగుతున్న అతన్ని చూచి ఏమనుకోవాలో తెలీలేదామెకి.

'నేను ఉద్యోగంలో చేరదల్చుకున్నాను.' పొడిగా ఏ ఉపోద్ఘాతం లేకుండా అంది పార్వతి.

పక్కనే బాంబు పేలినట్లు చూశారా తల్లీ కొడుకులు.

'నువ్వా? ఉద్యోగమా?'

రాజారావు నోట్లోంచి రెండే ప్రశ్నలు వచ్చాయి.

'ఏవమ్మోయ్! ఏమిటీ ధోరణి? ఉద్యోగం చేస్తూ రాణిలాగ నువ్వు కులుకుతూంటే ఇంట్లో వంటెవరు చేస్తారనుకున్నావమ్మోయ్! మంచిదానివే ... ఇదిగో ... వీడి మెత్తదనమే. ఏరా? అలా చూస్తావేమిటీ? నాకసలే ఒళ్లంతా నెప్పులు. నేనసలు వంట ఇంటివైపే వెళ్ళకూడదన్నారు డాక్టర్లు... ఏమోనమ్మోవ్! నాకు తెలీదు. ఉన్నాడుగా! గుదిబండని తగిలించుకున్నాడు ... వాడే చెప్తాడు. ఏమిట్రా? మాట్లాడవేం? అయ్యో...అబ్బా... ఒళ్లంతా నెప్పులు...' అంటూ దీర్ఘాలు తీసింది నాగమ్మ.

అప్పటిదాకా దర్జాగా తాంబూలాలేసుకుంటూ పేకాడుకుంటున్న వాళ్ళు తను చెప్పిన సంగతి విని ఒళ్ళు నెప్పులని ఒకరు, నోటమాట రాక మరొకరూ కూర్చున్న తీరు చూచి నవ్వుకుంది పార్వతి.

'అందుకేరా! ఈ డబ్బున్న వాళ్ళ పిల్లని వద్దన్నాను...అందులో...అదిగో ఆ రేణుకాదేవి స్నేహం... ఇంకెలా తయారవుతారు?' ఇంకా ఆరలేదు ఆవిడ దండకం.

'అబ్బా... నువ్వూరుకో అమ్మా' కసిరేశాడు రాజా.

'ఏమిటే రాణీ? ఎందుకు నువ్వు ఉద్యోగం చెయ్యడం? అంతగా డబ్బు కావాలనుకుంటే మీ అన్నయ్య దగ్గర నుంచి తెప్పించుకోవచ్చుగా...'

'ఉహూ...అది నాకిష్టం లేదు'

'ఇష్టం లేదా? ఏం చేదా?'

'అవును!'

'ఆహా! అలాగా! అయితే ఒక షరతు. అప్పుడే నిన్ను ఉద్యోగం చేయనిస్తాను.' ఠబుక్కున కఠినంగా మారిపోయాడు రాజా.

'ఏమిటది?'

'నీకొచ్చే డబ్బు నాకు ఇచ్చేయాలి'

నిర్ఘాంత పోయింది పార్వతి.

'వచ్చే డబ్బంతా మీకిచ్చేసే మాటయితే నేను ఉద్యోగం చెయ్యటమెందుకు?' అడిగింది పార్వతి.

'కాలక్షేపానికి' విసురుగా వచ్చింది జవాబు.

'కాదు ... నా ఖర్చుకు మీరేమీ ఇవ్వటం లేదు. అందుకని ఉద్యోగం చేసుకుందామనుకుంటున్నా.'

'నీ ఖర్చులేమున్నాయి పెద్ద. సరేలే... యాభయి రూపాయలిస్తాను. అంతే... మిగతాది ఎంతైనా నాకిచ్చేయాలి.'

అది ఆజ్ఞ, ఒప్పుకు తీరాలి.

ఆలోచించింది పార్వతి. ఏం చెప్పినా వినడింక అతను. లాభం లేదు.

'సరే' అంది చివరికి.

'ఏమిట్రా బాబూ' ఏదో అనబోయింది నాగమ్మ.

'నీకు తెలీదు ఊరుకోమ్మా'

అలా అంటూన్న కొడుకుని చూసి.

'అవునులే, నాకేం తెలుసు, నీకేది సంతోషమో అదే చెయ్యి నాన్నా. నీ ఆనందమే నా ఆనందం. నీ మాటెందుకు కాదనాలి నేను.' అంది పరుపుమీద వాలి పడుకుంటూ.

'బాగా చెప్పారు. అసలు ఆయనమాట ఎప్పుడు కాదన్నారు మీరు. అలా చేసుంటే బాగానే వుండేది.'

అంది పార్వతి.

'ఏమిటి రాణీ! ఇంకా ఉద్యోగంలో చేరనేలేదు. అప్పుడే మాట అందిస్తున్నావు.' నాగమ్మ ప్రశ్న.

ఆవిడ కెదురు జవాబు చెప్పదలుచుకోలేదు పార్వతి.

వాళ్ల మాటలకు నవ్వుకుంటూ రాజా రావు తల్లి పక్కనే పడుకుని నిద్రకుపక్రమించాడు.

* * *

పార్వతి ఉద్యోగంలో చేరి వారం రోజులయింది. చాలా ఉత్సాహంగా వుంటోంది.

సోషల్ వెల్‌ఫేర్ సెంటర్ ఒక పెద్ద భవనం.

అనాథ శరణాలయం, [illegible] ఫ్యామిలీ ప్లానింగ్ (కుటుంబ నియంత్రణ) యూనిట్ ...వగైరా...[illegible] అనుబంధ సంస్థలున్నాయి అందులో... పక్క పక్క [illegible] కూడా వెళ్ళొచ్చనట్టు వుంటుంది. [illegible] కేంద్రం కూడా వుంది. పార్వతి [illegible]ర్లో టీచర్‌గా చేరింది. ఎంతో పని...[illegible] లేకుండా. ఆమెకి ఎంతో నచ్చింది ఆ ఉద్యోగం.

[illegible]







# భారత జట్టు వైస్-క్యాప్టెన్ వెంకట్రాఘవన్ దేహదారుఢ్యాన్ని కాపాడుకోడానికి ఫిలిప్స్ సైకిలు త్రొక్కుతారు

భారతదేశపు గొప్ప ఆల్‌రౌండర్ వెంకట్. అతను క్రికెట్ ఆడని సమయాల్లో వ్యాయామంకోసమని సైకిలు త్రొక్కుతారు. అందువల్లనే అతను క్రికెట్ జగత్తులో పేరుప్రఖ్యాతులు గడించగలుగుతున్నారు. అందుకే అతనికి సైకిలు త్రొక్కడం వల్ల చాలా మేలు కలుగుతుందన్న నమ్మకం వున్నది.

ఇది అందరూ తెలుసుకోవలసిన నిజం. ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఫిలిప్స్ సైకిళ్లు చురుకైన యువకులకి మిక్కిలి శ్రేష్ఠమైనవి. దానికొక ప్రత్యేకమైన సొగసు వున్నది. అందులోని భాగాలన్నీ శ్రేష్ఠమైన ఉక్కుతో చేయబడినందున అది బలిష్ఠంగా వుంటుంది; సాఫీగా నడుస్తుంది. మీరు స్కూటర్ లేక మోటారుసైకిల్ కొనుక్కునేవరకూ ఫిలిప్స్ సైకిలునే త్రొక్కండి. ఆ తర్వాత ఫిలిప్స్‌ని అమ్మడం పెద్ద సమస్యేమీ కాదు. దానికెప్పుడూ మంచి ధర లభిస్తుంది.



**చురుకైన యువకులకి ఫిలిప్స్**



# ఫిలిప్స్

భారతదేశంలో తయారుచేయువారు:
**టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా**
అంబత్తూరు, మద్రాసు-53

ఆవిడకి పార్వతిసంగతి కొంచెం తెలుసు. రేణుక చెప్పింది శీలా మీనన్‌కి. అందుకే పార్వతంటే ఆవిడకి విపరీతమయిన అభిమానం. ఇంటికి పంపేసింది పార్వతిని.

ఇంటికొచ్చి విశ్రాంతిగా పక్కమీద వాలింది పార్వతి. ఇంట్లో ఎవరూ లేరు. మామూలే. ప్రతిరోజూ ఎక్కడికో ఒక చోటికి పోతారు నాగమ్మ, కావేరీ, రంగనాథం. వాళ్ళనుకున్న మాటలబట్టి — ఒక రోజు గీతాపారాయణ జరిగేచోటికి, ఒక రోజు సినిమాకు, మరోసారి ఊర్లో వింతలు విశేషాలు చూడ్డానికి ... స్నేహితుల ఇళ్ళకు అని తెలుసుకుంది పార్వతి.

కావేరి అప్పుడప్పుడు డాక్టరుదగ్గరకు వెళ్ళి రావడం, ఒకోరాత్రి ఇంటికే రాకపోడం పార్వతికి ఆశ్చర్యాన్ని కలిగించేది. కావేరి ఎర్రబడ్డ కళ్ళను చూచి తాగుడు అలవాటుకూడా వుందేమోనని పార్వతి అనుమానం.

ఆ అన్నకు తగ్గ తోబుట్టువే అనుకుంది పార్వతి.

పక్కమీద పడుకునే ఆలోచిస్తోంది.

తనకు నెల తప్పిందని తెలిసిన పార్వతికి మొదట ఏభావమూ అనిపించలేదు. ఏమీ అనిపించక మనసు శూన్యమయింది. కానీ... కానీ...కొంత సేపటికి ఒళ్ళంతా తేలికయి ఆనందంగా అనిపించింది. ఒకలాంటి హాయి ...మత్తు...తనకంటూ ఒక బాబు...తన ప్రాణం...తనరక్తం...తలుచుకుంటున్నకొద్దీ తెరలు తెరలుగా సంతోషం వేసింది పార్వతికి. బాబుని గురించి పగటికలలు కంటూ అలాగే పడుకుని నిద్రపోయింది.

* * *

రెండు రోజులుగా నలతగా వుంటున్న పార్వతిని చూచి నాగమ్మ, కావేరీ కూడా సంగతి తెలుసుకున్నారు.

'అయ్యో, కడుపుతో వుండడం కూడా ఒక భాగ్యమేనా ? మరీ అంత ఇదా ?' అంది నాగమ్మ ఒకరోజు రాత్రి అందరూ భోజనాలు చేస్తున్నప్పుడు.

'ఎవరి సంగతమ్మా?' రాజా అడిగాడు.

'ఇంకెవరి సంగతి నాయనా? మీ ఆవిడ నెల తప్పినట్లుంది. ఈ రోజు వంటకూడా చెయ్యలేక పోయిందిట.'

రాజారావేం మాట్లాడలేదు. అతని ఉద్దేశంలో అదేం పెద్ద చెప్పుకోతగ్గ విశేషమేం కాదు.

అందుకే అతనేం మాట్లాడలేదు. తల్లి




మీకు అజీర్ణంవల్ల బాధగా వుంటే పిల్లల మీద కోపగించడమెందుకు?

మీరు అజీర్ణంతో బాధపడుతున్నారా? కడుపునొప్పి ఎక్కువగా వున్నదా? అందువల్ల అసౌకర్యంగా వుంటుంది. ఏకాగ్రతలోపిస్తుంది. అకారణంగా కోపం వస్తుంది. కాని, ప్రేమమయి తల్లిగా మీరు నవ్వుతూ, హుషారుగా వుండాలి. లేకపోతే మీ పిల్లలు బాధపడతారు. వెంటనే హ్యూలెట్స్ మిక్స్చర్ తీసుకోండి. అది చాలా త్వరగా, శక్తివంతంగా పనిచేసి కడుపునొప్పిని తొలగిస్తుంది. అది కడుపులోపల-రక్షణ కవచంవంటి ఒక పొరను కల్పిస్తుంది. ఆమ్ల పదార్థాలని నిర్మూలించి, ఆహారం సులభంగా జీర్ణమవడానికి తోడ్పడుతుంది. హ్యూలెట్స్ మిక్స్చర్ పిల్లల జీర్ణకోశ వ్యాధులకుకూడా చాలా మంచిది.




హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరిస్తుంది

విరేచనాలని అరికట్టడానికి హ్యూలెట్స్ మిక్స్చర్ (నల్లని మూత) వాడండి.

సి.జె. హ్యూలెట్ అండ్ సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
150A/2, మౌంట్ రోడ్, మద్రాసు-2 CJH/6092

మూలశంకకు
త్వరగా
నమ్మకమైన
హెడన్‌సాతో
చికిత్సను పొందండి
-శస్త్రచికిత్స
అవసరములేదు!

DOL-327 TEL

వదాయి చెల్లింపుపై ట్రాన్సిస్టరు
వెల రూ. 165/-
(గ్యారంటీతో)
నెలకు రూ. 5/-
వంతున చెల్లించి,
బ్యాండు తీరు పర్ఫెక్టు పోర్టబుల్ ట్రాన్సిస్టర్
ండండి. ప్రతి గ్రామానికి పట్టణమునకు
ంపగలము. వివరములకు నేడే వ్రాయండి:
SHEBA SALES (23)
Roop Nagar, Delhi-7.

ఆరోగ్య సౌభాగ్యములకు
ముఖ్యాధారమగునది
ఆరోగ్య అనారోగ్య పరిస్థితులలో
లోధ్ర
గర్భ పోషణకు, సుఖ ప్రసవమునకు
గర్భరక్షక
నెలవిధ్యకు, నులబద్ధకములకు
మాదీఫల రసాయనం
ప్రసవానంతరం బలమునకు, క్షీరవృద్ధికి
సౌభాగ్య శొంఠి
68 సంవత్సరములకు పైగా
ప్రసిద్ధి పొందిన ఔషధములు.
కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్
మదరాసు-14.
ఏజంటు
తారాము జనరల్ స్టోర్సు (విజ్యంక్)
విజయవాడ.


## పొంగింపు...

మాట పెట్టుకుని అతనేమైనా తనని గొడవ చేస్తాడేమో అనుకుంది పార్వతి. కానీ రాజా అసలావిషయమే పట్టించుకోలేదు.

'పార్వతిగారూ! మీకు ఫోన్ వచ్చింది' అంటూ పక్క వాటాలోంచి సుభద్ర కేకేసింది. గదిలో పడుకుని వంటింటి కబుర్లు వింటున్న పార్వతి వెంటనే లేచి పక్కింటికి వెళ్ళింది, రిసీవరు అందుకుంది. అవతలి వైపునుంచి రేణుక.

'కంగ్రాట్సు పారూ! ఏమిటీ చెప్పవే లేదు.'

'ఏం చెప్పమన్నావ్ రేణూ! నీకెలా తెలిసింది?'

'శీలామీనన్ చెప్పింది ఇప్పుడే ఫోన్‌లో. ఏదో పనిమీద ఆవిడకి ఫోన్ చేశాను...ఆవిడే చెప్పింది. నేను కూడా నీకో మంచి శుభవార్త చెప్పాలి పార్వతీ.'

'చెప్పు. ఇంకా సందేహం దేనికు? చెప్పెయి. రవిచంద్ర వస్తున్నారా?'

'ఊ......'

'ఎప్పుడు?'

'సైసాతం'

'హోహోహో. ఎంత మంచి వార్త రేణూ! హా ... మా రేణూ పెళ్ళికూతురై పోతోంది...'

చిన్నగా సిగ్గుతో కూడిన నవ్వు వినిపించింది ఫోన్‌లో పార్వతికి.

'పార్వతీ! పెళ్ళి ఇంకా నెల్లాళ్ళుంది. ముహూర్తం నిశ్చయించేశాం. ఐజారు పను అన్నిటికీ నిన్ను తీసికెడతా. నగలు, చీరలు నువ్వే ఎన్నిక చెయ్యాలి...సరేనా ... ఇప్పుడే నీ దగ్గరకు వచ్చేద్దామని వుంది కానీ ... మీ సూర్యకాంతం...'

'ష ... రేణూ. అంతా ఇంట్లోనే వున్నారు.'

'తెలుసులే...రేపు కలుద్దాం'

'ఓ. కే.'

పార్వతి ఇంట్లోకి వెళ్ళేసరికి రాజా గుమ్మంలోనే ఎదురయ్యాడు.

'ఏమిటి రాణీ? ఎవరు ఫోన్ చేసింది?'

'రేణుకంటీ' లోపలికి నడుస్తూ అంది పార్వతి.

'ఏమిటి సంగతి?'

చెప్పాలా? వద్దా? అని సంశయించింది పార్వతి.

'ఏమీ లేదు' అని చెబుతూ వెంటనే భార్య సమాధానానికన్నా ఎదురుచూడకుండా వంటింట్లోకి వెళ్ళాడు రాజా.

బ్రతుకుజీవుడా అనుకుంది పార్వతి.

తను కూడా అన్నం తిందామని వంటింట్లోకి వెళ్ళింది. మగవాళ్ళ భోజనాలు అయ్యాయి కదా అనుకుంటూ.

'వస్తేనమ్మా' అంటూ రాజారావు చెయ్యి తుడుచుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు.

'ఏమిటి సంగతి?' అడిగింది పార్వతి వుండబట్టలేక.

'ఏమీ లేదోయి మరదలా! రేపు తెలుగు సినిమా ... మార్నింగ్‌షోకి వెడుతున్నాం.'

'ఏం సినిమా వదినా?'

అన్నం విస్తట్లోకి వడ్డించుకుంటూ అడిగింది పార్వతి.

'ఏమి సినిమా అయితే నీ కెందుకే రాణీ! నోపలేనిదానివి. సినిమాలు చూడకూడదమ్మా' అంది వెటకారంగా.

'మరదలా! నీ కిష్టమైన సినిమాయేలే ... మల్లీశ్వరి' అంది కావేరి పెద్దపెట్టున నవ్వుతూ.

'అబ్బ అంత నవ్వేమిటి గుండెలు దడదడలాడేలాగ' అనుకుంది పార్వతి. రాజా కూడా అంతే... అంత గట్టిగా నవ్వుతాడు.

ఒకరోజు మల్లీశ్వరిలో పాట కూనిరాగం తీస్తుంటే ఆ పాట, ఆ సినిమా అంత ఇష్టమా అని అడిగి తెలుసుకున్న కావేరి ఇప్పుడు ఇలా మాట అంటించింది.

ఏం మాట్లాడకుండా అన్నం తినసాగింది పార్వతి.

మల్లీశ్వరి... ఆ వూహా స్వప్నలోకాల్లోకి తీసికెళ్ళింది పార్వతిని.

మల్లీశ్వరి! ఎంత అదృష్టవంతురాలు! ఒకరిని ప్రేమించి అతనిచేతే ఆరాధింపబడిన ఆమె ధన్యజీవి.

నాగరాజు ... మల్లి ... తలుచుకుంటే హాయిగా వుంది. వెంటనే మధు గుర్తొచ్చాడు... మధు...

ఆ రాత్రంతా మల్లి, నాగరాజు ... మధు ... పదే పదే మనసులో మెదులుతూ పార్వతిని నిద్రకు దూరం చేశారు.

(ఇంకా ఉంది)

# విశ్వవిద్యాలయాలలో వ్యవహారికం

వ్యవహారానికి వ్యవహారికభాష ఉపయోగించడంలో తప్పులేదు. ఎందుకంటే అది ఎలాగూ వ్యవహారం గనుక. వ్యవహారం అంటే ఏమిటి? ఇదిగో—ఇదీ వ్యవహారమే! సమకాలీన పరిస్థితులపై చర్చ గాబట్టి ఇది వ్యవహారం. కాబట్టి ఈ వ్యాసాన్ని వ్యవహారిక భాషలో వ్రాస్తే తప్పులేదు. ఇట్లాగే ఉత్తరాలూ, దినపత్రికలూ, తాత్కాలిక ప్రయోజనాన్ని ఆశించి వ్రాసే వ్యాసాలూ, కథలూ, సినిమాలు ఇలాంటివన్నీ వ్యావహారిక భాషలోనుంటే తప్పు లేదు.

నేడు ప్రజలు మాట్లాడేభాషే వ్యవహారిక భాష అనడంలో చిక్కు లేదు. మన అవసరాలకు వ్యావహారిక భాషలోనే వ్రాస్తే తప్పు లేదని స్పష్టంగా తేలిపోయింది. అయితే ప్రశ్న యేమిటంటే—ఏ వ్యావహారికభాషను వాడాలి? అన్నదే!

తెలుగుదేశంలో నాలుగు రకాలైన వ్యావహారిక భాషలున్నాయి. ఇంకా చాలా ఉన్నా—

1. కృష్ణా గుంటూరు జిల్లాలలో మాట్లాడేభాష.
2. గోదావరిజిల్లాల భాష.
3. రాయలసీమభాష.
4. తెలంగాణాభాష—

అనేవే ప్రధానమైనవి.

ఈ నాలిగింటిలో మన నిత్య వ్యవహారానికి యే మాండలికాన్ని వాడుకుందాం! ఎవడిభాష వాడికి గొప్ప. రాయలసీమవారి భాషను గుంటూరువారు యాసగా ఉందని అనుకున్నట్టే రాయలసీమవారికి గుంటూరివారి భాష యాసగా ఉంటుంది! రాయలసీమవారు తమ భాషలోనే అసలైన తెలుగు ఉందనుకుంటే తప్పేముంది? వాళ్ళలా అనుకుంటున్నారని ఆ వ్యావహారిక భాషనే తెలుగులో ప్రామాణికమైన వ్యావహారికం అనుకుందామా! 'క్రను' 'బత్తి' అందామా! రాయలసీమవారికి బత్తి అంటే క్ర అని అర్థం! కోస్తా జిల్లాలలో దానికి గేదె అని అర్థం ఇలా యెన్నో పదాలున్నాయి!

గుంటూరు కృష్ణాజిల్లాలలో చదువుకున్నవారి సంఖ్య యెక్కువ. వీళ్ల రచనలన్నీ ఇక్కడి వ్యవహారికంలోనే చేశారు. అమాయకులైన ఇతర ప్రాంతాల ప్రజలీ మాండలికాన్ని అలవాటు చేసుకుని ఈ విధంగా రచనలు చేయడం సాగించారు. దానితో నేడు వ్యావహారికభాష అంటే కృష్ణా, గుంటూరు భాషే అయింది. రాయలసీమ, తెలంగాణాప్రజలు రచన చేయాలంటే కష్టపడి ఈ వ్యవహారిక భాషలో వ్రాయాలి. అలాకాక తమభాషలోనే వ్రాస్తే వారికి చాలా సులువుగా ఉంటుంది.

ఆ ప్రాంతాలవారికి నేడు ప్రామాణికం అని చాలామంది అనే పత్రికా భాషను నేర్చుకోవడం గ్రాంథిక భాషను నేర్చుకోవడం లాంటిదే!

అక్కడి విద్యార్థులను వ్యావహారిక భాషలో సమాధానాలు వ్రాయమంటే తమ మాండలిక భాషలో నైతేనే సులువుగా వ్రాస్తారు. పత్రికాభాషను వ్రాయడం కంటే గ్రాంథికభాషను వ్రాయడమే వారికి సులువు.

ఎవరి మాండలికంలో వారు వ్రాయవచ్చునంటే లెక్కలేనన్ని భాషలు పుడతాయి. అభివృద్ధిలోకి రాదలచుకున్నయే సమాజమూ ఇట్టి స్థితిని కోరుకోదు.

విశ్వవిద్యాలయంలో వ్యావహారిక భాషను పెడితే అది మన అనాగరకతకు చిహ్నం అవుతుందనడంలో సందేహం లేదు.

ఎందుకంటే విచ్చలవిడిగా సంచరించడం అనాగరకతకు గుర్తు.

కొన్ని కట్టుబాట్లు పెట్టుకొని మెలగడం నాగరకతకు చిహ్నం.

మనం అనాగరకదశలో ఉన్నప్పుడు వ్యావహారిక భాషనే వాడుకున్నాం. నాగరికదశలోకి వచ్చామనుకున్నప్పుడు భాషకు కట్టుబాట్లు చేసి, భాషకు ఒక రూపం కల్పించారు.

(56వ పేజీ చూడండి)





పి. గణపతి శాస్త్రి

దీనాతిదీనంగా, జాలిగా, సన్నగా ఎడతెగని ఏడుపు!

ఎవరిది చెప్మా ఆ ఏడుపు! క్రమక్రమంగా అది సన్నబడి మెల్లిగా ఆగి పోయింది.

అప్పటికింకా బాగా తెల్లవారలేదు. చెట్లమీది కాకులు కావుకావుమని అరుస్తున్నాయి. కొంచెం చలిగా ఉంది. అందుచేత మళ్లీ అలాగే దుప్పటి ముసుగు పెట్టుకుని పడుకున్నాను.

తిరిగి మరింత హృదయవిదారకంగా సన్నగా జాలిగా అదే ఏడుపు! ఉలికిపడి లేచాను. అది మా ఇంటి వీధి అరుగుమీది నించే వినబడుతూంది. ఇవతలికి వచ్చి, వోరగా వేసిఉన్న తలుపు తెరిచి చూశాను.

దుమ్ముకొట్టుకున్న ఎలక్ట్రిక్ లైటు గుడ్డి వెలుగులో పసివాడొకడు 'గుక్కతిప్పుకోకుండా గొంతెత్తి రాగాలు పెడుతున్నాడు! అప్పుటే నాకంతా బోధపడింది! వాడు మా పనిమనిషి నాగమ్మకొడుకే!

ఆ పిల్లవాడికి ఇంచుమించుగా మూడేళ్ళుంటాయి. పొట్ట బాగా బూరటిల్లింది. కాళ్లుచేతులు సన్నబడ్డాయి. బుగ్గలు రెండు వాచాయి. ముఖం పాలిపోయింది. కామెర్ల జబ్బేమో, కళ్లు కొంచెం పచ్చబడ్డాయి. జుట్టు చిందరవందరగా జీరాడుతూంది. ఉండి ఉండి మరింతగా గొంతెత్తి ఏడుస్తున్నాడు. వాడి ఆక్రోశం వింటూంటే ప్రపంచంలో దుఃఖం అంతా ఆ చిన్నారి గొంతులోనే గూడుకట్టుకున్నట్టు వినబడింది. దానిలో ఎంతటి దారుణయాతన!

వాడి కింతకుముందు కొన్నాళ్లపాటు జ్వరంకాసి నిమ్మళించిందని విన్నాను. అది మళ్లీ తిరగబెట్టి చిట్టచివరికి ఇలాగ కడుపులో పెద్దబల్లగా మారిపోయింది కాబోలు! ఆ జబ్బు ఇంతగా ముదిరి పోయిందని నాకు తెలియదు. నేను మరి ఆ ఏడుపు వినలేక పోయాను.

'నాగమ్మా! నాగమ్మా'

గట్టిగా పిలిచాను. మా ఇంటి పెరట్లో అంట్లు తోముతున్న నాగమ్మకిగాని ఆ పిలుపు వినబడలేదేమో, అని మరింత గట్టిగా కేక పెట్టాను.

చేస్తూ చేస్తూన్నపని అలాగే విడిచి పెట్టి, చేతులు తుడుచుకుంటూ నాగమ్మ నాదగ్గిరికి వచ్చి తెల్లబోయి చూసింది.

'తిన్నగా తెల్లవారిందో లేదో, అప్పుడే ఇంట్లో ఏమిటీగోల? మధ్యన వీణ్ణికూడా ఎందుకు వెంటబెట్టుకు వచ్చావు? ఇంట్లో దిగబెట్టి రాలేకపోయావా?'

'ఇంటిదగ్గిర వీణ్ని సముదాయించే వాళ్ళెవ్వరు లేరు బాబూ!... దిక్కుమొక్కు లేనిదాన్ని! ఏం చెయ్యమన్నారు బాబూ?'

'మీ పిల్ల ఉందిగా!'

'బొత్తిగా చిన్నపిల్ల, దానివల్ల ఏమవుతుంది బాబూ?'

'అందుకని వీణ్ని తీసుకువచ్చి మా నెత్తిమీద కూర్చోబెడతావా?'

గట్టిగా గొంతెత్తి గద్దించాను.

పనిమనిషి మరి సమాధానం చెప్పలేదు. ఆ పసివాణ్ని ఎత్తుకుని ఎంతో ఆప్యాయంగా సముదాయించింది. మరి కొంత సేపటికి వాడి ఏడుపు తగ్గింది. నాగమ్మ ఆ పిల్లవాణ్ని అక్కడే కూర్చోబెట్టి, తిరిగి పనిలోకి వెళ్ళిపోయింది. వాడు కనబడినంత వరకు దీనంగా తల్లివైపే చూస్తూ అలాగే కూర్చుండి పోయాడు.

నాగమ్మ మా ఇంట్లోనేకాక, ఇంకా ఏడెనిమండుగురు ఇరుగుపొరుగుల ఇళ్లల్లో కూడా పాచిపని చేస్తూ, అంట్లుగిన్నెలు, చెంబులు తోముతూంటుంది. ఒక్కొక్క ఇంటివల్ల ఆమెకు ఏడెనిమిది రూపాయల దాకా ముడుతుంది. ఇంకా బట్టలుతకడము, బజారుకివెళ్లి కూరలు తేవడము మొదలయిన పైపనులు కొన్ని చేయించుకుని, మా ఇరుగుపొరుగులలో కొందరు పది రూపాయలదాకా ఇస్తూంటారు.

పోయినవాళ్ళు పోగా నాగమ్మ కిద్దరు పిల్లలే మిగిలారు. పెద్దది ఆడపిల్ల. దానికింకా అయిదేళ్ళు నిండలేదు. మా వీధి చివర ఒకచుట్టుగుడిసె అద్దెకు తీసుకుని నాగమ్మ దానిలో ఉంటూంది. అందరి ఇళ్లలోను పనులన్నీ తెముల్చుకోవాలని తెల్లవారుజామునే పని మొదలుపెట్టి బా

పొద్దెక్కేదాకా చేస్తూనే ఉంటుంది. అప్పు డప్పుడు ఇళ్లల్లో మిగిలిన చద్దిఅన్నాలు, కూరలు, పచ్చళ్ళు, ఊరగాయలు, పులుసులు అడిగి తీసుకువెడుతూంటుంది. అలాగ పాటుపడుతున్న ఆమెకు రోజు గడవడమే కష్టంగా ఉంది. అయినా ఎలాగో అలాగ తన సంసారం నెట్టుకు వస్తూంది.

నాగమ్మ అంత దిక్కుమొక్కు లేనిది కాదు. మొగుడంటూ ఒకడున్నాడు. కాని అతగాడు ఒక పేరు తెన్నులేని మనిషి. దొరికి నప్పుడు ఏదో కూలీనాలీ చేస్తూంటాడు. కాని వచ్చి తాగుబోతు. తన సంపాదనలో చాలాభాగం తాగుడుకిందే దుబారా చేస్తాడు. సామాన్యంగా సాయంత్రం అయ్యేసరికి తప్ప తాగివచ్చి, నాగమ్మతో ఏదో తగాదా పెట్టుకుని, నానా హంగామాచేసి చావగొడతాడు. ఒక్కొక్కప్పుడు కూలీనాలీ దొరక్కపోతే భార్యనే డబ్బు తెమ్మని వేధించుకు తింటాడు. చేతిలో డబ్బేమయినా మిగిలితే, కాదనకుండా నాగమ్మ కొద్దో, గొప్పో ఇస్తూనే ఉంటుంది. లేనినాడు లేదంటుంది. కాని అతడామాట నమ్మడు. డబ్బున్నా ఇవ్వలేదని పెద్ద రభస లేవదీస్తాడు. నాగమ్మని నానా తిట్లు తిట్టి, కొట్టి, ఇల్లెగిరి పోయేటట్టు కేకలువేస్తూ వీధిలోకి వెళ్ళిపోతాడు. ఆతరవాత మళ్లీ ఎప్పటికి ఇంటికి తిరిగి వస్తాడో ఎవ్వరికి తెలియదు. ఒక్కొక్కప్పుడు ఆ కోపంలో కూలీనాలీకోసం పై ఊళ్లు కెక్కడికో వెళ్ళిపోతూంటాడు!

ఇటీవల నాలుగయిదు నెలలు గడిచినా మళ్ళీ ఇంటికి తిరిగిరాలేదు! ఎక్కడికి వెళ్ళిపోయాడో, ఎప్పటికి తిరిగివస్తాడో ఎవ్వరికి తెలియదు. అయినా మా పనిమనిషి దిగులు పడకుండా అలాగే కాలక్షేపం చేస్తూంది. ఇన్ని ఇబ్బందులు పడుతున్నా నాగమ్మ ముఖంమీద చిరునవ్వు ఎన్నడు చెరిగిపోలేదు. ఆమెది ఎప్పుడు నవ్వుతూ పేలుతూండే స్వభావం. కాని ఇటీవల పసివాడి కడుపులో బల్ల పెరిగిన కొద్దీ ఆ చిరునవ్వు కాస్త మటుమాయ మయినట్టుంది.

*   *   *

మరునాడు నాగమ్మ పనికి రాలేదు. మా ఆవిడే పాచిపని చేసుకుంటూంది.

'ఇదేమిటి నువ్వు చేసుకుంటున్నావు పని? నాగమ్మ ఎందుచేత రాలేదు?'

నాకేమి అంతుపట్టక అడిగాను.

'పిల్లవాడి ఒంట్లో బొత్తిగా బాగా లేదుట! అందువల్లే నాగమ్మ రాలేనుట!'

'వోహో, అలాగా!'

ఏదో ఇబ్బంది వచ్చి పడిందని చెప్పి, నాగమ్మ అప్పుడప్పుడు పనికి రావడం మానేస్తూంటుంది. మా పనిమనిషికి అది అలవాటే! అందుచేతనే రాలేదేమో అనుకున్నాను. మరి కొంతసేపటికి మా ఆవిడ నాదగ్గిరకివచ్చి నెమ్మదిగా నసిగింది.

'నాగమ్మకి ఈనెలజీతం ముందే కావాలిటండీ! పాపం, పిల్లవాడికి మందులేవో కొనాలిటండీ!'

నేను కొంతసేపు తటపటాయించాను. నాగమ్మకి మేము ఇచ్చేది ఎనిమిది రూపాయలే! అయితే మొన్న మొన్ననే కిందటి నెలజీతం అంతా ఇచ్చేశాను. మళ్ళీ ఇంతలోనే జీతం తే తెమ్మంటే ఎలాగ? సరేలే ఎలాగో అలాగ సర్దుబాటు చేసుకోవచ్చు ననుకుని, మారుమాట చెప్పకుండా ఆ ఎనిమిది రూపాయలు మా ఆవిడ చేతిలో పెట్టాను. వెంటనే ఆమె అవి తీసుకువెళ్ళి పనిమనిషికిచ్చి వచ్చింది.

ఆ మరుచటిరోజున నాగమ్మ పనిలోకి వచ్చింది. కాని ఆ మరునాడు రాలేదని మా ఆవిడ చెప్పింది. కారణమేమో, మాకెవ్వరికి తెలియలేదు. అయితే జాము పొద్దెక్కిన తరవాత జబ్బుతో చిక్కి శల్యమయిన పసివాణ్ణి భుజం మీద వేసుకొని నాగమ్మే మా ఇంటికి వచ్చింది. విపరీతమయిన భయంతో, ఆందోళనతో ఆమె ముఖం కళ పెళలాడిపోతూంది. కట్టుకున్న చీర అలుగ్గుడ్డలా తయారయింది. ఇక పిల్లవాడిమాట చెప్పనే అక్కరలేదు! వెర్రి భయంతోబాటు, నీరసము, నిర్ప్రాణ ఆ పసివాడి ముఖంలో తాండవిస్తున్నాయి. ఊపిరి పీల్చుకోడానికి కూడా ఆయాస పడుతున్నట్టు కనిపించాడు. తడబడుతున్న మాటలలో నాగమ్మ తనగోడు అంతా వెళ్లబోసుకుంది.

'అర్జంటుగా మావాడికి మందేదో కావాలని డాక్టరుగారు చీటీరాసి ఇచ్చారు బాబూ!... ఒక్క పదిరూపాయలుంటే ఇప్పించండి. కష్టపడి ఎలాగో అలాగ మీ ఋణం తీర్చుకుంటాను బాబూ! కాస్త ఈ సాయం చేసి పెట్టండి.'

నాగమ్మ పరిస్థితిమీద నాకు కొంచెం జాలి కలగకపోలేదు. అయితేమాత్రం, చీటికి మాటికి డబ్బు కావాలంటే నే నెక్కడినించి తేగలను? అదేసంగతి నెమ్మదిగా నచ్చజెప్పాను.

'మాటి మాటికి సొమ్ము కావాలంటే నేనెక్కడినించి తేగలను నాగమ్మా! మొన్ననే కదా, ముందుగా కావాలంటే ఎనిమిది రూపాయలిచ్చాను! ఇంతలోనే మళ్లీ ఎక్కడినించి తేగలను చెప్పు?'

అయినా పనిమనిషి అక్కడినించి కదలలేదు. ఆమె కళ్లమ్మట నీళ్ల పర్యంతము అయింది. కాని అతి కష్టంమీద ఆ ధోరణి దిగమింగుకుని అదేమాట రెట్టించింది. ఆపైన మా ఆవిడకూడా నాదగ్గిరకి వచ్చి, ఆ పదిరూపాయలు ఎలాగో అలాగ సర్ది, సాయం చెయ్యవలసిందని సిఫారసు చేసింది.

నెలలో మొదటివారం గడిచీ గడవక ముందే, నా జీతంరాళ్లన్నీ చాలావరకు హరించుకు పోతాయి. మిగిలిన కొద్ది మొత్తంతోనే నెల అంతా గడవాలి. మేము మాత్రం పెద్ద ఆస్తిపాస్తులున్న వాళ్లమా ఏమన్నానా?

మా పట్నంలో హైస్కూల్లో నేనొక హిస్టరీ అసిస్టెంటుని. నాకు చేతికి వచ్చే జీతం అంతా కలిసి రెండువందలే! ఆపైన మా ఇంట్లో సగంభాగం అద్దెకిచ్చి దానితో వచ్చిన రాబడితో అయిదుగురు పిల్లలు మేము అతి కష్టంమీద ఎంతో గుట్టుగా కాలక్షేపం చేస్తున్నాము. మాకంతకన్న వేరే ఆస్తిపాస్తులేవి లేవు.

అయినా పనిమనిషి పరిస్థితినిబట్టి పోనీ సాయపడదామనిపించింది. లోపలికి వెళ్లి పది రూపాయలనోటు తీసుకువచ్చి నాగమ్మ చేతిలో పెట్టాను. ఆమె కళ్లలో కృతజ్ఞత తొణికిసలాడింది.

నాగమ్మ మరునాడు యధాప్రకారంగా పనిచెయ్యడానికి వచ్చింది. ఇన్నాళ్లనించి పనికి తిన్నగా రాలేక పోయినందుకు మా ఆవిడ దగ్గిర నొచ్చుకుంది. కాని ఆట్టే సేపు ఉండలేదు. ఆదరాబాదరాగా పని ముగించుకుని వెంటనే వెళ్ళిపోయింది. అయితే పని చెయ్యడానికి రావడాన్ని బట్టి పసివాడి పరిస్థితి కొంత మెరుగుపడి ఉంటుందనుకున్నాను. అదేమాట కాఫీ తీసుకుంటున్న సమయంలో మా ఆవిడతో అన్నాను.

'నాగమ్మ వచ్చినట్టుందే! పిల్లవా

ఎలాగుంది ? కొంచెం గుణం కనిపించిందా? నింపాదిగా ఉన్నట్టేనా ?'

మా ఆవిడ ఉసూరుమని నిట్టూర్చింది.

'ఏం నింపాది? అలాగే ఉందిట ! కాని జ్వరం మాత్రం చాలావరకు తగ్గిందట !'

'అలాగా ! జ్వరం తగ్గిందంటే బాగా గుణం కనపడిందన్నమాటే !'

దానికి తిన్నగా సమాధానం చెప్పకుండానే మా ఆవిడ వెళ్ళిపోయింది. వేనాతరవాత కుటుంబం జమాఖర్చుల సర్దుబాట్ల గొడవల్లోపడి ఆ పిల్లవాడిమాటే ఆలోచించలేదు.

ఆ పైన రెండురోజుల తరవాత పిల్లవాణ్ణి భుజంమీద పడుకోబెట్టుకుని నాగమ్మ ప్రొద్దున్నే నాకెదురుగా నిలబడింది. దాన్ని చూడగానే మళ్ళీ డబ్బుకోసమే వచ్చిందని పసికట్టేసి, ముఖం చిట్లించుకున్నాను. అయినా ఏదో ఒకటి అడగాలి కనక విసుక్కుంటూ అన్నాను.

'ఎలాగుంది పిల్లాడికి ? కొంచెం నయమేనా ?'

నా ధోరణి గమనించి నాగమ్మ నిలువునా [illegible]గాలు పడింది.

'నిన్న మొన్న కొంచెం నింపాదిగానే ఉంది బాబూ ! కాని ఏం మాయరోగమో

# జవాబుదారీ

గాని, తెల్లవారేసరికి మళ్ళీ తిరగబెట్టింది ...నిలుచున్న పళంగా ఏదో ఇంజక్షనివ్వాలంటున్నారు డాక్టరుగారు! ఒక్క పన్నెండు రూపాయలుంటే ఇప్పించి పసివాడి ప్రాణం దక్కించండి ! ఆయన వెంటనే ఇంజక్షను కొని తీసుకు రమ్మంటున్నారు. ఇది ఇస్తే తప్పకుండా గుణం కనిపిస్తుందంటున్నారు బాబూ! ఒక్క పన్నెండు రూపాయలు చాలు! మీరుచేసిన మేలెన్నటికీ మరిచిపోను! తొందరగానే మీ అప్పు తీర్చివేస్తాను. కొంచెం కనికరించండి బాబూ!'

నాకు చిరాకు, విసుగు ఒక్కసారిగా తలకెక్కాయి. ఒళ్ళు మండిపోయింది. ఆ పసివాడి పరిస్థితి చూస్తే కొంచెం మనస్సు కరగకపోలేదు. అయితే మాత్రం నావంటివాడేమి చెయ్యగలడు? బాకీలన్నీ పూర్తిగా తీర్చివెయ్యగా ఆ నెలలో నా దగ్గిర మిగిలిన సొమ్ము పదిహేను రూపాయలే! అందులో పన్నెండు రూపాయలు నాగమ్మకిచ్చివేస్తే నెలాఖరుదాకా నాకెలాగ గడుస్తుంది? ఇంకా ఈనెలలో ఇరవైరోజులదాకా గడవాలి కదా! ఎంతటి ఆపాంతరం వచ్చినా నే నెవ్వరిని చేబదులిమ్మని నోరు విడిచి అడగలేను! అదీగాక నాగమ్మ నా మెత్తదనము కాని అలుసుగా తీసుకుంటున్నదని కూడా కనిపెట్టి వేసాను. ఇంక మెత్తబడ కూడదనుకున్నాను. అయినా నెమ్మదిగానే నచ్చచెప్పాను.

'చూడు నాగమ్మా ! అస్తమానమూ సొమ్ము తెమ్మంటే నే నెక్కడినించి తేగలను? చెప్పు ! ఇవ్వగలిగినంతవరకు ఇచ్చాను. ఇక నావల్ల కాదు... ఈ వీధిలో ఇంకా చాలా ఇళ్ళల్లో పని చేస్తున్నావుగా ! ఇంకెవ్వరినయినా అడిగితీసుకో ! ఇంక నాదగ్గిర ఒక్క చిల్లిగవ్వకూడా లేదు! తెలిసిందా?'

'ఇంతకుముందే అందరిని అడిగి కొంచెం కొంచెం తీసుకున్నాను బాబూ ! ఇంక ఎవ్వరిని అడిగినా, ఎన్నిసార్లు బ్రతిమాలుకున్నా, లేదు పొమ్మని కసిరికొడుతున్నారు... ఎవ్వరు ఇవ్వలేదు బాబూ?'

నాగమ్మ మరింత దీనంగా ప్రాధేయపడింది. ఆ సమయంలో ఆ పసివాడు మామధ్య జరుగుతున్న గొడవ విని భయపడ్డట్టున్నాడు. బిక్కమొహంతో ఏడుపు మొదలుపెట్టాడు.

ఆ ఏడుపు వినగానే నా కొక్కసారిగా ఒళ్ళంతా తేళ్ళు, జెర్రులు పాకుతున్నట్లనిపించింది. 'అనవసరంగా ఈ గొడవంతా నామీద విరుచుకుపడిందేమిటి?' అనుకుని విసుక్కున్నాను. మరి భరించలేక నాగమ్మకేసి చురచురా చూసి కస్సుమన్నాను.

'అయితే నన్నేం చెయ్యమంటావు? చేతనయితే ఇంకెవ్వరినయినా అడుగు ! లేకపోతే ఆ పైన నువ్వేమి చేసుకుంటావో చేసుకో ! అంతేగాని మా ఇంట్లోమాత్రం గొడవ చెయ్యకు ! తెలిసిందా? ముందుగా కదు ఇక్కడినించి ! ఏం కదలవేం ?'

నాగమ్మ భుజంమీద పడుకున్న పసివాడు నా గావు కేకలతో హడలెత్తిపోయి, గొంతెత్తి రాగాలారంభించాడు. వాడి కడుపులో బల్ల అప్పటికే బాగా పెరిగిపోయి గుండెమీదికి ఎగదన్నింది. కళ్ళు రెండు మరింతగా పచ్చబడ్డాయి. ఆ పసివాడి చూపులో భరించలేని యమయాతన ! భీతి ! ఆందోళన !

అంతగట్టిగా విదిలించివేసినా నాగమ్మ అక్కడినించి కదలలేదు. కంట నీరు పెట్టుకుని చిరిగినచీర చెరగుతో ముఖం కప్పివేసుకున్నది. ఆ పిల్లవాడి ఏడుపు క్రమక్రమంగా [illegible] వచ్చబడింది. [illegible]



# మీ బాలుడు బలహీనంగా ఉన్నాడా?
# అతని ఆహారంలో పోషక శక్తి సరిగా లేదా?
# అతనికి సరిగా ఆకలి వేయదా?
# అయితే అతనికి ఫెరడాల్ ఇవ్వండి...

అతను ఎంత బలంగా, దిట్టంగా ఎదుగుతాడో పరిశీలించండి. పాలు, ఆహారధాన్యాలు, కూరగాయలు, పళ్లు మరియు గ్రుడ్లు వంటి స్వాభావిక ఆహారాలవల్ల లభించే మేలును, పోషణను మీ బిడ్డకు ఒక ఫెరడాల్ మాత్రమే సమకూర్చగలదు. ఎందువల్లనంటే, ఇనుము, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలు ఫెరడాల్‌లో ఖచ్చితంగా సరియైన పాళ్లలో ఉన్నాయి. ఎముకలు దంతాలు దృఢంగా తయారవాలన్నా, కండరాలు బలంగా పెరగాలన్నా, పుష్టిగల రక్తం పట్టాలన్నా, శరీరంలో రోగనిరోధక శక్తి వృద్ధి పొందాలన్నా, కంటి చూపు కలకాలం బాగా ఉండాలన్నా, మీ బిడ్డ చురుకుగా ఆరోగ్యంగా ఎదగాలన్నా, ఫెరడాల్‌లో ఉన్న ఈ ఇనుము, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలు మిక్కిలి అవసరం. ప్రతిరోజు ప్రొద్దున పూట రాత్రి పూట మీ బాలునికి ఫెరడాల్ ఇవ్వండి. పాలతో కలిపి అయినా సరే, దేనితోను కలపకుండా యథాతథంగా నైనా సరే తీసుకోవచ్చును. కుటుంబంలో అందరికీ ఫెరడాల్ మంచిదని గుర్తుంచుకోండి.

FERRADOL

PARKE-DAVIS

## ఫెరడాల్®

కమ్మని రుచి కలది

కుటుంబమంతకూ మంచిది

[illegible] ఉత్పత్తి

LAISONS

# కరగ పండుగ

కరగపండుగ వేడ్రోత్సవమైన పండుగ. ఈ పండుగ యిటీవలే వచ్చింది. బెంగళూరంతా కొన్ని లక్షల జనవాహినితో నిండిపోయింది. వూరంతా తిరునాళ్ళయిపోయింది.

మల్లెపూల కిరీటం

ఈ పండుగలో కరగ అనే మల్లెపూల కిరీటంవంటి దానిని ఒక పూజారి తన నెత్తిమీద వుంచుకుని అర్థరాత్రి మొదలు తెల్లారేవరకూ వూరిలోని అన్ని ముఖ్యమైన దేవాలయాలూ సందర్శించి, తిరిగి తన గుడికి వెళ్ళిపోతాడు. ఈ కరగ ప్రభను మోసేవారు 'తిగ్గలా' జాతివారట. వంశపారంపర్యంగా ఈ కుటుంబంవారు ధర్మరాయస్వామి ఆలయంలో అర్చకులుగా వుంటూ, ఆ స్వామిని సేవిస్తూ వున్నారట. ఈ కరగవేడుక వీరి చేతుల మీదుగానే జరుగుతుందట. కరగపండుగ రెండుమూడు వారాలున్నదనగా ఆ ధర్మరాయస్వామి ఆలయం పూజారి బహునిష్ఠతో దినమూ పూజలు చెయ్యాలట. మితభుక్తం ఆచరించాలట. స్త్రీ సంపర్కారం, చింతపకూడా వుండరాదట.

అపచారం

ఈయేడు 37 ఏళ్ల బాలప్ప అనే వ్యక్తి కరగ ప్రభను శిరస్సున ధరించడానికి పండుగకు రెండు వారాలముందు నించే నిష్టలోవుండి, ఆరోజు బెంగుళూరు సంపంగి కోనేరులో స్నానంచేసి, అర్థరాత్రి కరగ మల్లెపూల ప్రభను నెత్తికి ఎత్తుకున్నాడట. కాని, ఆ గుడిలో ప్రదక్షిణం చేస్తుండగానే కరగప్రభ అతని తలమీంచి జారి, దాదాపు పడినంతపనీ అయ్యిందట. తలమీద మోస్తున్న బాలయ్యకు మైకం వచ్చి, రక్తం కక్కుకుంటూ పడిపోయాడని, ఇది మహాపచారఫలమనీ వూళ్ళో చాలామంది చెప్పుకున్నారు. సుమారో పాతికేళ్ల క్రితం ఇలాగే కరగ మోస్తున్న వాని తలమీంచి ఆ ప్రభ జారిపోయిందని, అది జరిగిన కిలారీ రోడ్డులో అతన్ని ఎక్కడి కక్కడే అతని జాతివారు నరికేశారని, అనక అతన్ని అక్కడే పాతిపెట్టి అక్కడో గుడికట్టారని కూడా జనంలోని కొందరు మరికొందరితో చెప్పనారంభించారు. అదంతకుముందే విన్నవారు, తెలిసినవారు ఔనౌనన్నారు. తెలీనివారు అలాగా అని ఆశ్చర్యపోయారు. నమ్మనివారు నమ్మమన్నారు.

ప్రభ మోయమన్న బాలప్పకు ఎవరో అసూయాపరులు చేతబడివంటిది చేసివుండివుంటారని, అందుకే అతనలా విరుచుకు పడిపోయాడనీ అన్నారు మరికొందరు.

ఆ సమయంలో కరగమోసే భక్తునికి సాక్షాత్తూ ద్రౌపదీదేవి ఆవహిస్తుందని, ఆ భక్తుడు భజన చేసుకుంటూ మైమరచి ప్రభను తలమీద స్వీకరిస్తాడనీ అన్నారు.

ప్రభ జారిపోవడం బెంగుళూరుకు రానున్న కీడు సూచించడమేనన్నారు కొందరు.

ఆశాభంగం

చివరికి పోయిన సంవత్సరం కరగ మోసిన చన్నప్పను పిలిచి, అతను తత్సంబంధమైన నిష్టతో పూజలు జరపకపోయినా, అతని నెత్తిమీద పెట్టి, వూళ్ళో లాంఛనంగా తిప్పారట. ఈ పండుగను చూడవచ్చిన కొన్నిలక్షల ప్రజకు ఇది ఆశాభంగం కలిగించింది.

ఈ వేడుకలోని విపరీతాంశాలను నమ్మినవారు నమ్మారు, లేనివారు నమ్మం పొమ్మన్నారు.

(పండుగనాడు ఆ పండుగ గురించి జనం చెప్పుకున్నదీ, విపరీతాలను చర్చించుకుంటుండగా విన్నదీ కలిపి రాసినది మాత్రమే!)

—ఫాలాక్షుడు



పడిన ముఖంతో వాడు రెప్పపాటయినా లేకుండా నావైపే చూస్తున్నాడు!

మా ఆవిడ అంతలోనే అందుకుని పని మనిషిని గట్టిగా కసురుకుంది.

'ఏమిటి నాగమ్మా, పొద్దున్నే ఈ గొడవ! మాటిమాటికీ పది, పన్నెండు తెమ్మంటే ఎక్కడినించి తేగలం చెప్పు! ఇంక అప్పో, సప్పో చేస్తేనేగాని మాకే ఈ నెలంతా గడవదు! అటువంటప్పుడు నీ కెక్కడినించి తేగలం చెప్పు! చేతిలో ఉన్నప్పుడు నీకెప్పుడయినా లోటు చేశామా! మొన్న అడగ్గానే పదిరూపాయలు ఇవ్వలేదూ? కాస్త పక్కఇంటివారి నడిగి తీసుకో! మళ్ళీ అడిగితే ఆ మాత్రం సాయం చెయ్యకపోరులే! అంతేగాని మమ్మల్నిమాత్రం ఇబ్బంది పెట్టకు!... వెళ్ళు మరి!'

మా ఆవిడ కూడా అలాగ సన్నసన్నగా చివాట్లు పెట్టేసరికి నాగమ్మకింక మాట పెగలలేదు. పైపైకి ఉబుకుతున్న ఏడుపంతా లోలోపలే దిగమింగుకుని గిరుక్కున వెనక్కి తిరిగి వెంటనే అక్కడినించి వెళ్ళిపోయింది.

* * *

ఆ తరవాత రెండు రోజులదాకా నాగమ్మ మా గడప తొక్కలేదు. ఆపదలో ఆదుకోలేదన్న కోపంలో ఇక మా ఇంట్లో పని చెయ్యడమే మానుకుంటుందేమో అనుకున్నాము. ఆ రెండు రోజులు ఇంటిపని అంతా మా ఆవిడే చేసుకుంది.

మూడవనాటి సాయంత్రం నేను స్కూలు నించి తిరిగివచ్చి పడకకుర్చీలో విశ్రమించగానే మా ఆవిడ కాఫీ కప్పు నా చేతికందించింది.

'ఏం? ఈవేళన్నా నాగమ్మ వచ్చిందా?' యాధాలాభంగా అడిగాను.

'ఆఁ. మధ్యాహ్నం బాగా చల్లబడ్డాక వచ్చింది. పెరట్లో పనిచేస్తూంది. పాపం, దానికొడుకు పోయాట్టండీ!'

'అయ్యో. పాపం, అలాగా! ఎప్పుడు?'

'నిన్న సాయంత్రమే పోయాట్ట! రెండు రోజుల క్రితమే తీసుకువస్తే తప్పకుండా మాట దక్కి ఉండేదని డాక్టరుగారన్నారుట! ఇక ఇప్పుడు వ్యవహారం చెయ్యిదాటిపోయిందని నాగమ్మమీద విసుక్కున్నారుట! అయినా

పాపం ఆయనే వొందుకోకొచ్చి; ఇంజక్షను వేసి, చెయ్యగలిగినదంతా చేశారుట!... అంతకీ ఆ దైవం చిన్నచూపు చూపినప్పుడింక ఎవరుమాత్రం చెయ్యగలిగిందేమిటి ఉండి!'

ఆ సంగతి వినగానే నా మనస్సు చివుక్కుమంది. వెంటనే వెళ్ళి పనిమనిషి నొకసారి పలకరించి ఓదార్చాలనుకున్నాను. కాని నాకు మొహం చెల్లలేదు. మా ఆవిడ అది అంతా అంతటితో తుంచివేసుకుని లోపలికి వెళ్ళిపోయింది. ఆ పైన నేను పరిపరివిధాల మధనపడ్డాను. అడగ్గానే ఆ పన్నెండు రూపాయలు నాగమ్మకిచ్చి ఉంటే ఆ పసివాడు తప్పకుండా బ్రతికి ఉండేవాడని పశ్చాత్తాప పడ్డాను. అన్నీ ఆ దైవం నెత్తిమీదికి నెట్టివెయ్యడం వట్టి ఆత్మవంచనే కాగలదని నిశ్చయించుకున్నాను.

పెరట్లో పని చేసుకుంటున్న నాగమ్మ అప్పుడప్పుడు కొడుకుని తలచుకుని, కుమిలి కుమిలి ఏడుస్తూంది. ఆ ఏడుపు వింటున్న కొద్ది చేజేతులా నేనే ఆ పసివాణ్ణి చంపేశాననిపించింది. ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచి పెట్టాను.

కాని మరికొంత సేపటికి నా పశ్చాత్తాపం తలుచుకుంటే నాకే నవ్వు వచ్చింది! లోకంలో అనేక దుస్సంఘటనల వెనకాల శతకోటి కారణాలుంటాయి! ఎన్నెన్నో పరిస్థితులేర్పడి ఉంటాయి. అటువంటప్పుడు నాగమ్మ కొడుకు మరణానికి నేనొక్కణ్ణే కారకుణ్ణని మధన పడడంలో అర్థమేమిటి?

ఆ పిల్లవాడి కడుపులో బిళ్ళ బయలుదేరుతున్నప్పుడు నాగమ్మే బాగా అశ్రద్ధ చేసి ఉండవచ్చును. ఇంకా ముదిరి చెయ్యి దాటిన పరిస్థితిలోనే డాక్టరు దగ్గరికి వెళ్ళి ఉండవచ్చును. ఆ పైన ఆ డాక్టరు రోగ నిదానంలో కొంత పొరపాటుపడి ఉండవచ్చును. ఇంకా పథ్యపానాదులలో కూడా అశ్రద్ధ జరిగి ఉండవచ్చును. అసలు ఆ డానికి తగిన తిండి లేకపోవడం వల


ఇదిగో ఒక నిరపాయమైన తలనొప్పి బిళ్ళ!

అవేదన్®
ఆశ్చర్యకరమైన ఎపెప్‌గలది
(ఎన్-అసిటిల్-పి-అమినోఫెనాల్)



తలనొప్పి బిళ్ళను వేసుకొనుటకు భయపడి మీరు ఎన్ని పార్లు తలనొప్పిని ఎక్కువ సేపు అనుభవించేరు?

అవేదన్ మీ తలనొప్పికి నిరపాయమైనది. ఎందుకంటే, దానిలో ఆశ్చర్యకరమైన ఎపెప్ ఉంది.

ఆశ్చర్యకరమైన ఎపెప్‌గల అవేదన్ తలనొప్పి, జలుబు జ్వరాలకు నిరపాయమైన, నిశ్చయమైన ఉపశమనమును కలిగిస్తుంది.






SQUIBB
SARABHAI CHEMICALS

Shilpi HPMA 47/70 TEL

# శాంతికి లేఖ

## ఎస్. ఎల్. దేవి.

ప్రియమైన శాంతి,

చాలా రోజులకు నీకీ జాబు వ్రాస్తున్నా. పూర్వం నుండీ మహర్షులు, తపోనిధులు శాంతి కోసం తమ తపస్సును ధారపోసారు. వేదాలు, ఉపనిషత్తులు శాంతి వాక్యాలను ఘోషిస్తునే ఉన్నాయి. మహాత్ముడు పండిత నెహ్రూ దేశశాంతికి తమ ప్రాణాల నర్పించారు.

కాని, నేటి నవనాగరికతా ప్రపంచంలో శాంతి ఎక్కడ? ఎక్కడో గో చోట యుద్ధాలు, బీభత్సాలు, దారుణ మరణాలు, హత్యలు జరుగుతునే యున్నవి.

మానవులు స్వార్థాన్ని, ద్వేషాన్ని పెంపొందించుకుంటూ, పదవీ వ్యామోహితులై, ధనా కాంక్షులై మెలుగుతుంటే శాంతి ఎక్కడ యుంటుంది? ఈ మధ్య నలిగిపోయేవారు మధ్యతరగతి కుటుంబీకులు మనలాంటివారు కదా!

అన్ని అవకాశాలు అందుబాటులో ఉంటాయి గొప్పవారికి. ఉద్యోగాలు, కాలేజీలో సీట్లు, ఉన్నత స్థానాలు సులభంగా లభిస్తాయి.

మధ్యతరగతి వారికి ఏది ఆ శక్తి? చాలీచాలని జీతాల్తో తమ పిల్లలేనా పైకి రావాలని చదివిస్తే ఉద్యోగాలేవి? మా అక్కయ్య కొడుకు విషయం నీకు తెలిసిందే! ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజినుండి 'కాల్' వస్తుందని నిరీక్షణతో, తిరగడంతోనే ఎనర్జీ, మనీ కూడా వేస్ట్ అవుతుంటే మన శాంతి ఎక్కడుంటుంది చెప్పు.

అశాంతితో అలమటిస్తున్న మనలాంటి వారికి 'గోరుచుట్టు మీద రోకటి పోటు' అన్నట్లు ఈ విపరీత ధరల పెరుగుదల అశనిపాతంలా ఉంటోంది. ఇంటి అద్దెలు, పన్నులు, బస్, ట్రెయిన్, టాక్సీ, రిక్షా ఛార్జీలు, కాయగూరలు, బియ్యం, వస్తువుల ధరలు, స్కూళ్ళు, కాలేజీల ఫీజులు ఇత్యాదులు మిన్ను ముట్టుతుంటే ఏం చేయగలం మనం? 'అడగనిదే అమ్మ అయినా పెట్టదనే' ఆర్యోక్తిలా మనల్ని పోషించే ప్రభుత్వాన్ని యాచించక మరెవర్ని యాచించగలం?

పెంరోజులైతే మన రాష్ట్రం ఎలాగుందో తెలుసా?

కార్యకలాపములన్నీ స్తంభించి పోయి నిర్జీవంగా నిల్చి ఉన్నాయి ఆఫీసులన్నీ. చెత్త చెదారాలతో, మురికి నీటి దుర్గంధంతో కొన్ని పట్టణాల వీధులు అలరారుతుంటే, జీతాలు లేక మాలాంటి వారి బాధ నీకు అగమ్యగోచరంగా ఉండవచ్చును.

'మీ సమ్మె సంగతి మీకే తెలియాలి. మాటిమాటికీ సమ్మేనా? సమ్మర్, వింటర్ సీజన్స్‌లా ఈ సమ్మెల సీజన్ అని ఒకటి ఉంటే ఎవరేనా ఎన్నైనా సమ్మెలు చేయగల్గుదురు' అని నిర్మొహమాటంగా హితవాక్యాలు బోధిస్తున్న మా సేఠ్ ధాటికి ఆగలేక, ఇక ఇక్కడ ఎలాగూ ఈ నెల అరువు పుట్టదని వెనక్కితిరిగి వచ్చేసాము.

ఈనెల ఎన్ని ఖర్చులు వచ్చాయో తెలుసా? పిన్నికూతురి పెండ్లి. పొరుగూరు వెళ్ళి రావడం, ఏడాది పొడుగునా ఈ జిహ్వకు కావలసిన ఊరగాయ పెట్టుకోవడం; ఏది లేకపోయినా ఎడ్జస్ట్ కాలేకపోతున్నాం ఈ కలికాలంలో. మనస్సుకి శాంతి ఎలా ఉంటుందో ఊహించుకో. స్నేహితురాండ్రవద్ద చేసిన అప్పు నెల ఆదాయానికి మించిపోయింది ఇప్పటికే.

ఏది ఏలాగైనా మా సమ్మెకి త్వరలో మంచి ప్రతిఫలం ఉంటుందని, మనబోటివాళ్ళం మనశ్శాంతిని పొందగలమని ఆశిస్తూ ఈ లేఖ ముగిస్తున్నాను.

ఎల్లప్పుడు శాంతిని వాంఛించే
ప్రశాంతి.

## జవాబు దొరికె

ఆ రోగం పొటమరించి ఉండవచ్చును. జనత సరిఅయిన ఆహారం తీసుకోక పోవడం వల్లనే రోగాలు హెచ్చు పెరిగిపోతున్నాయని పెద్ద పెద్ద నిపుణులంటున్నారు కదా! తరవాత నలుగురు అంటున్నట్లు, ఆ దైవం అనుకూలించకపోవడం వల్ల కూడా ఆ పసివాడు లాగ చనిపోయి ఉండవచ్చును!

ఇలాగ ఎన్నెన్నో కారణాలుండవచ్చునని స్పష్టంగా కనిపిస్తున్నప్పుడు లేనిపోని మథనతో నేనెందుకు బాధపడాలి? నా బేలతనము, లేనిపోని జాలి తలుచుకుంటే నాకే నవ్వు వచ్చింది!

అంతలోనే తిరిగి నాగమ్మ ఏడుపు వినబడింది. నాలో మళ్ళీ మథన బయలుదేరింది. అదే సమయంలో ఆ పసివాడి దుర్దృష్టానికి నాకు కూడా కొంత అయినా జవాబు దొరికే లేక పోలేదనిపించింది. కాని ఇలాంటి స్వల్ప బాధ్యతలను వైరిమొద్రిగా ఆలోచిస్తూ కూర్చుంటే, మరి బ్రతుకు బాటలో అడుగు పడడమే కష్టమయిపోగలదని స్ఫురించింది! కనక ఇక ఆ మాటే తలపెట్టకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాను.

అయినా ఆ సాయంత్రం అంతా గజిబిజి ఆలోచనలతో, లేనిపోని మథనతో సతమతమయ్యాను. కాస్త కాలక్షేపానికని ఏదయినా సినిమాకి వెళ్ళాలనుకున్నాను. తీరా అక్కడికి వెళ్ళాక అది వట్టి చవకబారు స్టంటు పిక్చరని తెలిసింది! పోనీలే అనుకుని టిక్కెట్టు తీసుకుని హాలులోకి వెళ్ళి కూర్చున్నాను. ఆవేళ ఆ స్టంటు పిక్చరు కూడా బాగానే ఉన్నట్లనిపించింది! అప్పటికి నా మనస్సు పూర్తిగా తేలికపడింది.

ఇంటికి తిరిగివచ్చి వేన్నీళ్లతో స్నానంచేసి, భోజనం ముగించుకున్నాను. పరుపు మీద పడుకుని చేతికి దొరికిన పాత డిటెక్టివ్ నవల చదవడం మొదలుపెట్టాను. మరి కొంత సేపటికి ఆవలింతలతోబాటు నిద్ర ముంచుకు వచ్చింది. హాయిగా నిద్రపోయాను.

కాని తెల్లవారుజామున మగతనిద్రలో నా అంతరాంతరంలో రెప్పపాటయినా లేని ఆ పసివాడిచూపు ప్రత్యక్షమయింది! వాడి పిడుప్పుకూడా అలాగే హృదయ విదారకంగా, నవ్వుగా, జాలిగా [illegible] ●



# తల్లివేరి ఎక్కడికి?

మహీధర రామమోహనరావు

సీరియల్

## 2

భోజనం చేస్తూ చేస్తూ భద్ర దిగాలు పడి గోడకి జేర్లబడిపోయింది.

'కృష్ణుడు ఏం చేస్తున్నాడో ఏమిటో...' అనుకొంది.

ఆమె కొడుకు రామకృష్ణ వరంగల్లులో మెడికల్ కాలేజీలో చదువుతున్నాడు. తెలంగాణా కల్లోలాల తాకిడికి కాలేజీ మూత పడి రమారమి ఆరునెలలు ఇంట్లోనే వుండిపోయేడు. ఆమధ్యనే కాలేజీలు తెరుస్తే మళ్ళీ వెళ్లేడు. ఆతడు అక్కడ ఏం కష్టపడి పోతున్నాడోయని తల్లి ఆదుర్దా.

ఆమె ఆదుర్దాకి అర్థం లేదన్నట్లు జానకి చాల చులకనచేసింది.

'ఏం చేస్తుంటాడు. తొమ్మిదిన్నర అయిందా? హాస్టలులో భోజనాలయిపోయి వుంటాయి. గదుల్లో కూర్చుని చదువుకుంటూ వుండి వుంటారు. కాక పెళ్లాం పిల్లకూడా అక్కడే చదువుతూందన్నావా? ఇద్దరూ ఏ సినిమా ప్రోగ్రామో వేసుకుని ఉంటారు. ఏం చిన్నపిల్లడా? పెళ్ళాన్ని ఏరుకోగల వయస్సు ఉన్నవాడు...'

'పాపం వాళ్ళలాంటి వాళ్ళు కారే—' అంది భద్ర.

జానకి నవ్వింది.

'మరి పెళ్ళాని ఏం చేద్దామనుకున్నావంటావు.' భద్రకూడా నవ్వింది. అంతలో దిగాలు పడింది. 'ఏమో, ఏం చదువో ఏంపాడో' అంది భద్ర నిరుత్సాహంగా, 'మావూళ్ళో మీరు వుండడానికి వీలులేదు. లేచిపొండంటూంటే ఎందుకక్కడికి చెప్పు. అక్కడగాక మరోచోట ఏర్పాటు చెయ్యండంటే ఈయన వినిపించుకోరు. వాడంత కంటె 'ఎక్కడమాత్రం ఇంత కంటె బాగుందంటారు. మధ్య నాకు మనసుండబట్టడంలేదు...'

'అంటావేమిటి? నువ్వు పత్రికలు చూడ్డంలేదా?'

'చూడకేం చూస్తున్నా. అయితే అనుభవం మనది కాదు గనక అక్కడేమైనా మెరుగేమో ననిపిస్తూంటుంది.'

'రాసికి అంగోస్త్రం చుట్టేవాళ్ళు ప్రతిచోటా వెలిసేరు. అయితే బాధపడే వాళ్ళు వేరు. ఎక్కడికక్కడే ఆదేశం తమ తాతముత్తాలాగ అంగోస్త్రం చుట్టి కళ్ళురుముతున్న వాళ్ళు వచ్చేరు. తప్పదు. ఈ గొడవేదో ఎక్కడికక్కడ చూసుకోవాలే గాని...'

తనకొడుకు చదువు కుదటపడడం, ఎవ్వరూ వంటిమీద ఏ పెట్రోలోపోసి అగ్గిపుల్ల గియ్యకపోవడం తప్ప మరో ఆలోచనలేదు భద్రకి. ఇప్పటికేనా మరల కాలేజీలు తెరవనిచ్చినందుకు సంతోషం కనబరచింది.

'ఏదో గుడ్డిలోమెల్ల ఇప్పటికేనా చల్లబడ్డారు. అదీ వయమే.'

జానకి పకపక నవ్వింది.

'వాళ్లెప్పుడూ గుడ్డివాళ్ళు కాదే తల్లీ దేశం ఏమైపోయిందో, పిల్లగాళ్ల చదువులు ఏమౌతాయో వాళ్ళకి పట్టిందంటావా? కాలేజీలూ, స్కూళ్లూ మూతబడితే చదువు నష్టపోయింది నీకొడు కొక్కడిదేనా? కాదు నూటికి తొంభయ్యయిదు మంది తెలంగాణం వాళ్ళదే. కాని చదువు పోగొట్టుకొన్న భాగ్యుల్లో ఈనాయకుల పిల్లలు వుండివుండరు. ఏమీ సందేహం అక్కర్లేదు.'

జానకి ధోరణిని అడ్డంకొడుతూ వీధిలో పెద్ద అలజడీ, కేకలూ వినిపించేయి.

ఇద్దరూ ఆలకించేరు. మొదట కొంతసేపు అర్థంకాలేదు. తర్వాత అవేవో నినాదాలులా వినిపించేయి.

'ఏదన్నా వూరేగింపు వుందేమో, కేకలు అల్లా వున్నాయి.'— అంది భద్ర.

'ఎవరి వూరేగింపూ ?'

'చెప్పలేం. బహుశా జనసంఘం వాళ్ళదేమో. ఈమధ్య ఒకటి రెండుమాట్లు వాళ్ల హడావిడి విన్నాం.'

'అదీ వుందీ ?'

'అయ్యో!'

'ఎవరేమిటి దాని పెద్దలు'

'ఇంకా ప్రత్యేకంగా ఎవరూ గోదాలోకి దిగినట్లులేదు. షావుకారు జగన్నాధంగారు జ్ఞాపకం వున్నారా ?'

'బాగుంది!'

'ఆయన పోయేరు. ఆయన తమ్ముడు ఒకడు కథలూ అవీ వ్రాస్తుంటాడు. జనసంఘం పత్రిక వుంది బెజవాడలో. ఆ పత్రిక వాళ్ళు జరిపిన కథల పోటీలో అతని కథకి బహుమతి వచ్చింది. నెల్నాళ్లక్రితం వాళ్లింటికి జనసంఘం నాయకులు వచ్చి వూళ్ళో మీటింగుపెట్టి వెళ్లేరు. అంతే.'

ఇంతలో వూరేగింపు వారి వీధిలోకే తిరిగినట్లు తోచింది. నినాదాలు బిగ్గరగా, స్పష్టంగా వినిపిస్తున్నాయి.

'ప్రజాద్రోహులు...నశించాలి.'

జానకి భద్రముఖంలోకి చూసింది. ఆమె జానకి విస్తట్లో పెరుగు పోస్తూ, 'మార్క్సిస్టులదే వుంటుంది.'— అంది. అనుభవజ్ఞానంతో.

జానకి చటుక్కున లేచింది. భద్ర లబలబ లాడింది.

'భోజనం పూర్తిచెయ్యి. తిట్లతో కడుపు నిండదు. వాళ్ళ విన్నవంతిట్లు వినడానికి అన్నం మానుకోవాలా ఖర్మ!'

—అంటూ చేయిపట్టుకు లాగి కూర్చో బెట్టింది. జానకి 'చూడాలి' అంది.

'ఏమీ బెంగపెట్టుకోకు, నీకోసం అయినా పదినిముషాలు మన గుమ్మంలో నిలబడ తారు. ఫర్వాలేదు.'

భద్ర జానకి చెయ్యి వదలలేదు.

భోజనం పూర్తిచేశాక చేయి వదిలింది.

'ఆకు నే తీస్తా. చేయి కడుక్కువెళ్ళి ఆ వినోదం ఏదో చూడు.'

కాని, జానకి లేచిపోలేదు. ఇద్దరూ కలిసే వీధిగుమ్మంలోకి వచ్చేరు.

వస్తూ భద్ర గేటుమీద ఆర్చిలో వున్న లైటు వేసింది. మెర్క్యురీలైటు వెల్తురు వెన్నెలలాగ వీధి అంతా నిండింది.

* * *

మేడమీద పిట్టగోడ వానుకొని నలుగు రైదుగురు చూస్తూండడం, వీధితలుపు తీసుకొని ఆడవాళ్లు గుమ్మంలో నిలబడ డంతో ఊరేగింపు కంఠం ఏకస్వరంలో నిల బడింది. స్వరమూ దృఢపడింది. దానికి పూతంగా బిగించిన పిడికిళ్లు గాలిని గుద్దు తున్నాయి.

'ప్రజా ద్రోహులు...'

ఆ కీచుగొంతుక విని జానకి అటు తిరిగింది. ఆశ్చర్యం కలిగింది.

'వాడు జోగన్న కాడూ!'

'ఆ. జోగన్నే.'

'వాడు మార్క్సిస్టా?'

'ఆ.'

'ఎప్పటినుంచి?' అని జానకి. ఆమెకు గ్రామంలో రౌడీగా పేరుపడ్డ జోగన్నను మార్క్సిస్టులు జేరతియ్యడం వింతగావుంది.

'52 ఎన్నికల్లో మందలో కలిసేడు. పార్టీ కలిసివున్న కాలంలోనే కమ్యూనిస్టు విభూతి ఇచ్చేరు. ఇపుడు మార్క్సిస్టు...' —అంటూ భద్ర సంగ్రహంగా చెప్పేసింది.

'ఇంక వూరుకో. మనం మాట్లాడు కోడం చూసి వాళ్ళు మరీ రెచ్చిపోతారు'— అంది.

కాని, ఆ వినడమో, విన్నట్లు వూహిం చడమో అదివరకే జరిగిపోయింది నినాదాలు చిత్ర చిత్ర రూపాలలో ప్రస్తరిస్తున్నారు.

'ప్రజాద్రోహులు—నశించాలి.'

'కమ్యూనిజానికి వెన్నుపోటు పొడిచిన—'

'బూర్జువా భూస్వామి కాంగ్రెసుతో చేతులు కలిపిన—'

గుమ్మానికి ఎదురుగా వూరేగింపు నిలబడి పోయింది. వూరేగింపుముందు లావుపాటి బట్టతల మనిషి ఎవరా అని జానకి ఆలోచన. ఆయన ఎవరో భద్రనోట విని నిర్విణ్ణురాలే అయిపోయింది.

'డాక్టరు సుందరరావుగారా!'

భద్ర తలవూపి వూరుకుంది.

'పక్కన. ఆ కళ్లజోడు?'

'ఆయన కొడుకు రంగనాయకులు.'

'అతడు డాక్టరుట కాదూ?'

'ఊఁ.'

'ఇద్దరూ...'

'ఈవేళ వరకు మహేశ్వరులు. 'పిల కై'వులు...'

జానకి ముఖాన చిరునవ్వు తోచింది, వర్ణన వినేసరికి.

'ఈ నాలుగైదేళ్లనుంచి పోలు మధ్య కమ్యూనిస్టు తిట్టువదకోశంలో కొత్తగా చేరిన పదాలు వినే అవకాశం కలిగి స్తున్నారు.'

వరండాలో స్త్రీల పెదవుల కదలికలు తమ్ము గురించే అనిపించి వూరేగింపులో కీచుగొంతు మరింత పదునెక్కింది.

'పోలీసుబంట్లు...నశించాలి.'

మేడమీద పిల్లలు పెద్దగా నవ్విన ధ్వని. నిత్యానందం కంఠం వినబడి జానకి తిరిగి చూసింది. వీధిగదిలో అతడు కూర్చుని వున్నాడు. తలుపులు, కిటికీలు అన్నీ తెరిచి, లైట్లువేసి వున్నాయి. ద్వారం మీద బోర్డు కనిపిస్తూంది.

—'భారత కమ్యూనిస్టుపార్టీ గ్రామశాఖ కార్యాలయం.—'



[illegible] అర్థం అయింది.

'ఏమిటి బావా!'

'మీరు పైకి వెళ్ళండి. అల్లా తప్పు కాదని పిల్లలకి చెప్పండి. మర్యాద కాదు.'

ఆ మాట పూర్తి కాకుండానే వీధిలో పెద్ద గంద్రగోళం ప్రారంభమయింది. భద్ర అదుర్దాగా వరాండా చివరకు గబగబ నడిచి నిలబడ్డింది

'అయ్యో! రంగమ్మగారు.'

మరుక్షణంలో గట్టిగానే మగణ్ణి కేక వేసింది.

'త్వరగా రాండి. రంగమ్మగారిని పట్టుకోండి, సుందరరావుగారి మీదపడి కొడుతూంది. అయ్యో చాక్కా చింపేస్తూంది.'

బ్రాహ్మణాగ్రహారంలో ఆడదాని నోట ఎప్పుడైనా వినిపించే అవకాశం వుందా అని సించేటంత జుగుప్సాకరమైన పదజాలంతో రంగమ్మ సుందరరావును తిడుతూంది. మీద పడి రక్కింది. ఆ ఆవేశంలో ఆమె నోటి నుంచి వెలువడ్డ తుంపరలతో ఆయన ముఖం తడిసిపోతూంది.

హఠాత్తుగా వచ్చిపడ్డ ఈ ఉత్పాతం ఏమిటో, ఎందుకో మొదట ఆయనకు అర్థం కాలేదు. సత్యానందం ఇంటి వద్దకు వచ్చేకనే ఆమె తమమీద పడిపోయిందని చూసేడు. ఆమె ఎక్కడి నుంచి వచ్చిందో చూడలేదు. కాని, ఆ యింట్లో నించే వచ్చిందనిపించింది. సత్యానందమే ఆమెను తమ మీదికి వదిలి వుంటాడు. పోలీసు ఏజంట్లు అని తామిచ్చిన నినాదం నొప్పి కలిగించింది. ఈ దౌర్జన్యానికి పూనుకొన్నారనిపించింది. శత్రువు మరింత పొడుచుకుని, కుళ్ళేటట్లు చేయడానికై మళ్లీ ఆ నినాదం ఇచ్చేడు.

'పోలీసు ఏజంట్లు...'

రంగమ్మను దూరంగా లాగెయ్యడానికి చేసే ప్రయత్నంలో ఎవ్వరూ దాని నందుకోలేదు. కాని, ఆ నినాదమే రంగమ్మ ఆవేశాన్ని రెచ్చగొట్టింది.

'నాబాబుని పోలీసులకి పట్టుచెప్పిన లంజ ...కొడుకువి నీవేనా ఈ త్రా ... నిన్ను చంపేస్తా. మహమ్మాయి వండేస్తా ... పేగులు తోడేస్తా ... నీ కడుపు కాలిపోనూ...'

రంగమ్మ ఆయాస పడిపోతూంది. పట్టుకొన్న వాళ్ళకి లొంగడం లేదు. వాళ్ళ చేతుల్లోంచి బయటపడడానికి గింజుకొంటూంది. గిజాయించుకొంటూంది. పైన్సు మేస్టారు ఆమెను అనునయించడానికి ప్రయత్నిస్తున్నాడు.

'రంగా! రంగా! తప్పు. చూడు. నువ్వు ఎవరిని తిడుతున్నావో చూసేవా? ఇరుగో డాక్టరుగారు. వాళ్ళనాన్నగారు; ఆయన, రంగా! విన్నావా?'...

'నేను వినను, వీడా డాక్టరుగారి తండ్రి! కాదు. పోలీసు ఏజంటు. వీడే, ఆరోజున నాబాబును చైనా మనిషి అని పట్టించి ఇచ్చేడు. వీడే, వీడే!'

ఆ ఆరోపణ సుందరరావును నిర్వాక్కుణ్ణి చేసింది. తమ పార్టీలోంచి నక్సల్‌బరీ వాదులు విడిపోయి, జనశక్తిని స్వాధీనం చేసుకొన్నప్పుడు వాళ్ల చర్యల్ని ఖండిస్తూ సభలు పెట్టేడు.

'భగత్సింగ్ మార్గమే మా మార్గం!
గువేరా మార్గమే మా మార్గం' అన్న నినాదాలు ఇవ్వడంలోని ప్రమాదాలు అతి వోర్పుగా వివరించేడు. పోలీసులు, ప్రభుత్వంవలన రాగల నిర్బంధాలు చెప్పేడు. గ్రామంలో ఆ బాపతు కుర్రాళ్ళకి రంగమ్మ కొడుకు కేశవరావు నాయకుడు. అతడు తనతో వేసుకొన్న వాదనలు ఖండించి, తన మతం స్థాపించుకొన్నాడు, దానినే ఈమె పోలీసుకు పట్టుచెప్పడంగా వర్ణిస్తూంది. సుందరరావుకి అసహ్యం వేసింది. తాను కుర్రవాడిని ఆ ప్రమాదంలో పడకుండా కాపాడా లనుకొన్నాడు. వినలేదు. పోయి, మిడతలా మాడిపోయేడు. దానికి తననే తిట్టడం దుర్భరం అనిపించింది. కాని, ఏమీచెయ్యలేడు. ఆడది. ఆత్మరక్షణ పేరుతో వేనా నాలుగు తగిలించడానికి లేదు.

సత్యానందం ఇంక దూరంగా వుండలేక పోయేడు. గబ గబ ముందుకొచ్చి సుందర రావు మొగంమీదకు పోతున్న రంగమ్మ చేయి గట్టిగా పట్టుకొన్నాడు.

'భద్రా, జానకీ ఈవిణ్ణి పట్టుకోండి.'

నలుగురూ పోగడి, ఆమెను భర్త సాయంతో బయటకు తెచ్చేరు

'కాస్త శాంతించేవరకూ లోపలికి తీసుకుపొండి.' —అని భద్ర లోపలికి దారి తీసింది. 'జానిపలన రాగల నిందను నిరిగినా సత్యానందం ఏమీ అనలేదు.

తీసుకుపోతున్నా ఆమె అరుస్తూనే వుంది— 'నువ్వు పోలీసోళ్ళ తాబేదారువురా ...నిన్ను చంపేస్తా...'

ఆ అల్లరికీ, తిట్లకూ, సత్యానందం సుందరరావుయెడ సానుభూతి చూపేడు.

'ఆవిణ్ణి, ఆవిడ మాటల్నీ పట్టించుకోకండి. కొడుకుపోయిన దుఃఖంలో ఆమెకు మతిపోయింది. మనం అంతా ఎరిగిందే...'

ఆ వోదార్పు సుందరరావుకు తోడికోడలి దెప్పుడులా వినిపించింది. కోపంతో పెదవులు అదిరిపోతున్నాయి.

'నీకిందులో పాత్ర ఏమీ లేదనుకోవా అనా?'— అన్నాడు.

నీమాటకు విలువనివ్వడం అనవసరం అన్నట్లు సత్యానందం మరేమీ అనకుండా వెనుతిరిగేడు.

అతడూ వెనుతిరగగానే వూరేగింపులోంచి ఎవరో విసిరిన రాయి తగిలి, గేటులో పైన వున్న లైటు డోము పగిలి గాజుముక్కలు గల్లున క్రిందపడ్డాయి.

సత్యానందం చటుక్కున నిలబడ్డాడు.

వెనకనుంచి డాక్టరు రంగనాయకులు గొంతు ఖంగుమని వినిపించింది.

'ఎవరిదాపని ?'

ఎవ్వరూ మాట్లాడలేదు. మరల అతని కంఠమే వినిపించింది.

'క్షమించండి! సత్యానందంగారూ!'

వెనువెంటనే సుందరరావు కంయ్ మన్నాడు.

'ప్రజావుద్యమాలకు వెన్నుపోటు పొడిచే ద్రోహచర్యలమీద ప్రజల కోపం బహుముఖాలుగా వ్యక్తమవుతుంటి. ప్రజల న్యాయమైన ఆగ్రహానికి కమ్యూనిస్టులు క్షమార్పణ చెప్పక్కర్లేదు.'

'బాగా చెప్పేరు. కుర్రాడు అతడికింకా అనుభవం చాలదు.' అన్నాడు వెక్కసంగా సత్యానందం. గాజు పెంకుల మీద అడుగు పడకుండా, జాగ్రత్తగా చూసుకొంటూ అతడు లోపలికెళ్ళేడు.

'భద్రా! వాళ్ళంతా వెళ్ళిపోయేక చీపురు తీసుకొని గేట్లో గాజు పెంకులు వో పక్కకు తుడిచెయ్యావోయి. ఎవరన్నా తొక్కితే కాలు తెగుతుంది.'

'గాజు పెంకులు ఎక్కడివి?' అంది భద్ర

సౌందర్యము మరియు తాజాదనపు భావన...సింథాల్ సబ్బుతో

మీ కోసము... అపూర్వమైన సౌందర్యము, రోజంతా తాజాదనము... రెండు విధములుగా పనిచేసే సింథాల్ సబ్బుతో

సింథాల్ లో ప్రపంచములో కెల్ల ఎంతో బాగుగా పనిచేసే క్రిమినాశిని జి-11 (హెక్సాక్లోరోఫీన్) ఉంది.

జి-11 గల సింథాల్ మాత్రమే మిమ్మల్ని అందముగా తాజాగా ఉంచగలదు.




సింథాల్ నిజంగా దుర్గంధ నివారిణి సబ్బు

Interpub/GS/20 Tel

ఆశ్చర్యంగా!

'మె ర్క్యు రీ లై టు డో ము వ గి రి పోయిందిలే'—అన్నాడు సత్యానందం తాపీగా.

వెనకనుంచి కొత్త వినాదం వినిపించింది.

ప్రజాసేవకులమీద రివిజనిస్టుల దౌర్జన్యాలు—'

ఆ గొంతు మందరరావుది.

'వశింవాలి'—అది వూరేగింపు వాంఛ. శుందరరావు దానిని నిరాకరించేడు.

'శావనార్మాలు లాభంలేదు' ఖండితంగా చెప్పాలి— 'పొగనివ్వం!'—అనండి'

* * *

రంగమ్మ దుఃఖానికి కారణం విని జానకి నిర్విణ్ణురాలయింది. ఆమెకు తన జీవితం జ్ఞాపకంవచ్చి తూలిపోయింది.

ఆమె పరిస్థితిని గమనించి భద్ర కంగారు పడింది. పెద్దకూతురును పిలిచింది.

'పిన్నిని మేడమీదకు తీసుకుపోయి పక్క వెయ్యి. ఒంట్లో బాగులేదు.'

తల్లి అనారోగ్యం వార్త విని రవీంద్ర పరుగెత్తి వచ్చేడు. సాధనా, ఆతడూ చెరో చెయ్యీ పట్టుకొని ఆమెను మేడమీద గదిలో పడుకోపెట్టేరు. ఇద్దరూ చెరొక వైపునా కుర్చీలు లాక్కుని కూర్చున్నారు.

'ఎల్లా వుందమ్మా!'

'నాకేంలా, బాగానే వున్నా—' అంది

# ఈదారి ఎక్కడికి?

కాని, ఆ మాటతోనే ఏడుపు వచ్చేసింది. నోట్లో పైటకొంగు కుక్కుకొని, పరువు మీద బోర్లాదొర్లి తలదాచుకుంది. వక్కలు ఎగరెయ్యడం చూస్తే ఆమె వెక్కివెక్కి ఏడుస్తున్నదని అర్థం అవుతూంది. సాధన ఏమిటిది అన్నట్టు ఆతనివంక చూసింది. వూరుకోమన్నట్టు కన్ను మలిపేడు. తల్లి నడ్డిమీద సమాశ్వసనంగా చెయ్యి వేసుకొని నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

తల్లి దుఃఖకారణం రవీంద్ర గ్రహించేడు. ఆతడు తండ్రిని ఎరగడు. కాని, ఆతని మరణగాథ తెలుసు. ఆ గాథ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా తల్లి అల్లా ఏడుస్తుంది. ఒకటిరెండు రోజులు మందకొడిగా, పరధ్యానంగా వుంటుంది.

రంగమ్మ దుఃఖకారణం వినడంతో జానకికి భర్త గుర్తు వచ్చేడు. రవీంద్రకూడా భయపడుతూనే వున్నాడు. పీధిలో జరిగిన గంద్రగోళం, గలభా ఏమిటో సాధన ఇందాకా ఆతనికి చెప్పింది:

'ఆవిడ పేరు రంగరాజమ్మ. అంతా రంగమ్మగారంటారు. మావూరి హైస్కూలు సైన్సు మేస్టారి భార్య.'

'కొడుకు చచ్చిపోతే పిచ్చి ఎక్కిందని ఇందాకా అనూరాధ చెప్పింది, ఈవిడేనా?'

'ఎప్పుడు చెప్పింది, అప్పుడే.'

'మేం వచ్చినప్పుడేలే.'

'ఆమెకి ఒక్కడే కొడుకు. వరంగల్‌లో అన్నయ్యతో మెడిసిన్ చదువుతున్నాడు. నెల రోజుల క్రిందట అరెస్టు చేశారన్నారు. పది రోజుల క్రితం శ్రీకాకుళంజిల్లాలో పోలీసులు కాల్చి చంపేశారన్నారు. ఆ మాట వినగానే రంగమ్మగారికి మతి చలించింది.

'ఆయన నక్సలైటా?'

'ఔనట,' అని సాధన తలవూపింది. 'మంచివాడూ, తెలివిగలవాడూ. ఫైనలియర్‌లో వున్నాడు. మానాన్నతో అస్తమానం వాదం వేసుకొనేవాడు. మా అన్నయ్యా అతడూ చాలస్నేహంగా వుంటారు. ఈ వార్త విన్నాక మా అన్నయ్యని గురించి అమ్మ బెంగపెట్టుకున్నాదేమో'.....

......రాత్రి పన్నెండు కొట్టేవరకూ ఆ యింట్లో ఎవ్వరూ నిద్రపోలేదు. సరదాగా రెండు నెలలు గడపాలని జానకి ఇరవయ్యేళ్ల తర్వాత వూళ్లోకి రావడం, వచ్చిన రోజునే ఈఘటన జరగడం, మనస్సులోని గాయం కలకవేసి జానకి బాధపడడం సత్యానందం దంపతుల్ని ఎంతో ఖిన్నపరచింది. చాలసేపు దగ్గర కూర్చుని ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పేరు. పిల్లలంతా నిద్రవచ్చి పోయి పడుకున్నారు. కొంత పర్వుకొన్నదనిపించేక సత్యానందం వెళ్లిపోయేడు. భద్ర ఆమె పక్కనే మంచం వేసుకు పడుకుంది.

కాని, ఇద్దరికీ నిద్రలేదు. ఆ సంగతి ఇద్దరూ ఎరుగుదురు. కాని ఇద్దరూ ఎరగనట్లే చాలసేపు నటించేరు.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. అంతా నిద్రపోయారు. ఆ సమ్మకం కలిగేక భద్ర లేచి కూర్చుంది.

'జానకీ,'

'ఊఁ,'

'నిద్ర పోలేదూ?'

'రావడంలేదు,'

భద్ర మంచంమీద వొరిగింది.

'కళ్లుమూసుకో, అదే వస్తుంది.'

మరల కొంచెం సేపయ్యాక జానకి పలకరించింది.

'అక్కా!'

'ఊఁ.'

'నిన్ను పెళ్లిచేసుకొని కుండకపోతే



ఆయన బ్రతికేవుండేవారేమో. నా దుర దృష్టం ఆయన్ని కొట్టుకుపోయిందో, ఏమో...'

భద్ర లేచి కూర్చుంది. ఆ అనుమానానికి సమాధానం ఏం వుంది? కోపం చూపింది.

'ఏం మతిగాని పోయిందా యేం? చదువుకున్న దానివి కూడాను.'

'కాదక్కా! ఎంత చదువుకున్నా ఆ అనుమానం సెలవేస్తూనే వుంది. మన పూర్వం వాళ్లు పెట్టిన నిషేధాలూ, చెప్పిన అభ్యంతరాలూ నిజమేనేమో అనిపిస్తూంటుంది. ఒక నిండు ప్రాణాన్ని నా అజ్ఞానానికి బలి పెట్టేనేమో.'

ఆమె దుఃఖం చూస్తూంటే భద్రకూ కంఠం నిండి వచ్చింది. తన బలహీనతను కప్పుకొనేందుకు అవహేళనకు అందుకుంది.

'ఇది మరీ బాగుంది కాదూ! చాలా బాగుంది. వ్రేరి కుదిరింది. రోకలి తలకు చుట్టమన్నాడట నీలాంటివాడే. కాకపోతే ఏమిటే అది. అప్పుడు— ఆ మూడు నాలుగేళ్లలో ఒక్క తెలుగు దేశంలో మూడు నాలుగు వందల మందిని పోలీసాళ్ళు చంపేశారన్నారు. మళ్ళీ ఇప్పుడు ఈ ఏడాదీ ఆరు నెలలలోనూ అప్పుడే ఏభయి—అరవై మందిని చంపేశారంటున్నారు. చంపివేయబడ్డ వాళ్ళంతా వితంతువుల్ని పెళ్ళాడిన వాళ్ళుకారు. వాళ్ల పెళ్ళాలు చెడ్డ నక్షత్రం చూసుకొని సమర్తాడిన వాళ్ళూ కాదు...'

ఒక్క నిముషం పూరుకొని భద్రే మళ్ళీ అంది.

'పాపం కేశవరావుకి పెళ్లే కాలేదు. మరా తనికి ఎవరి శని చుట్టుకుందంటావ్?'

ఆ మాటకి కూడా జానకి వెక్కి వెక్కి ఏడవడమే గాని ఏ సమాధానమూ ఇవ్వలేదు. ఆమెను చూస్తూంటే భద్రకు కళ్ళనీళ్లు తిరిగేయి. 'ఊరుకో' మనబోయింది. ఆ మాట అనబోయేసరికి తనకే కంఠం నిండి వచ్చింది. పూరుకుంది.

కొద్దిసేపటికి ఇద్దరూ సర్దుకొన్నారు. భద్ర కళ్ళు తుడుచుకొంది.

'ఇల్లాంటి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు. నీలాగే ఆలోచించడం మొదలెడితే దానికి అంతం వుందా?' మన దురదృష్టాలు ఈ హత్యలకి ప్రోత్సాహం ఇచ్చేస్తే మరి అయ్యో అనుకోవలసిన పని కూడా వుండదు.'

'తెలుసు. నాకూ తెలుసు. ఇది నా మూర్ఖత్వమని. కాని మనస్సు నిలబడదు ఒక్కొక్కప్పుడు ఆయన బ్రతికే వున్నారేమో ననిపిస్తుంది. ఆ ఆశ కలిగినప్పుడు అన్నం కూడా నోటికి పోదు... లేకపోతే


# సుగంధమైన స్పెన్సర్స చుట్టలు

పాలతీన్ సంచులలో
గాలిపోకుండ ప్యాక్ చేయబడినవి.
స్పెన్సర్స్ చుట్టలనే వాడండి.




డిస్ట్రిబ్యూటర్లు: ఆకుల బలరామయ్య & సన్స్, విజయవాడ–1. సువర్ణ ట్రేడింగ్ కంపెనీ, గుంటూరు–3. వాసవి జనరల్ స్టోర్స్, ఒంగోలు. శ్రీ ఏజన్సీస్, గూడూరు [నెల్లూరు జిల్లా]

ఇప్పటికి కూడా వెళ్ళిపోతారా?...అందరి విషయంలోలాగ ఆయన మరి లేరనుకొంటే వుండే బాధవేరు. ఒక ఏడుపు ఏడుస్తాం. మరి వూరుకుంటాం. మనస్సుకీ ఆరాటం వుండదు.'

నీవు కూడా? భద్ర కాతర స్వరంతో అడిగింది—'నీకింకా ఆశ వుందా?'

జానకి తల అడ్డంగా తిప్పింది. అందులో ఆమెకు ఏమాత్రం సందేహం లేదనేదే కని పిస్తూంది. కాని మాటమాత్రం అంత ఖండితంగా లేదు.

'మనకి ఎంతో ప్రేమ వున్నవాళ్ళయినా, మన ద్వేషం వున్నా వాళ్ళు చచ్చిపోయా రంటే కూడా నమ్మలేం. అల్లూరి సీతా రామరాజు కోసం మరో వందేళ్ళు గడిచాక కూడా వెతుకుతాం. సుభాష్‌బోసు మాటే మిటి? వాళ్ళ మీద మనకున్న ప్రేమా, అభిమానం అల్లాంటివి. ఎంతో ద్వేషించే హిట్లరు నిజంగా చచ్చిపోయాడంటారా అని ళ్ళ తరవాత కూడా కొందరు ప్రశ్నిం లేదు? మనుష్యుల బలహీనత అది. విషయంలో అదే జరుగుతూంది.'

క్క నిముషం లటపటాయించినట్లు .'

ప్పటికీ ఆ ఆశ చచ్చిపోయిందనుకో . ఆయన వచ్చి నాకోసం అక్కడ కుతుంటారేమో, నేనిక్కడున్నానే. దాహూ—అనిపిస్తూందంటే నమ్ముతావా?' తికు మతిపోయింది.'

'రాత్రి రంగమ్మగారిని చూసినప్పటి నుంచి మనస్సు తరుముతూంది.'

# ఈదారి ఎక్కడికి?

'ఏమిటి నీ ఆశకి ఆధారం?'

'ఏమీలేదు భ్రమ.'

చాలసేపు ఇద్దరూ వూరుకొన్నారు. తర వాత మళ్ళీ జానకే ప్రారంభించింది.

'మేము చంపేసేమంటే ఆరోజుల్లో కాదు, ఈరోజుల్లో మాత్రం పోలీసులకి అడ్డు ఏముంది? పట్టుబడి పారిపోతూంటే కాల్చేశామంటారు. ఎదురుబొందురు కాల్పుల్లో చచ్చిపోయారంటారు. ఆత్మరక్షణకి కాల్చేశా మంటారు. వాళ్ళకి ఎదురేముంది? కాని ఇక్కడ అటువంటిదేమీ లేదు. మనిషి అదృశ్యం అయిపోయేడు. ఏమయిపోయినట్లు? గవర్నమెంటు ఎక్కడికేనా ప్రవాసం పంపేసి ఎరగనట్లు నటిస్తూందా?'

తానే నమ్మలేని కారణాలనూ, అను మానాలనూ జానకి బయటపెట్టింది. వాని కున్న ఆపత్తులరీత్యా ఇంతవరకు వానిని ఎవ్వరిదగ్గరా చెప్పలేకపోయింది. తన చదువునూ, తెలివినీ అపహాస్యం చేస్తారని భయం. కాని భద్రకూడా ఆ దుఃఖంలో సహభాగురాలు. కనుక వానిని చెప్పడానికి సిగ్గు కలగలేదు.

భద్రకు అసలు రావలసిన ప్రశ్న తోచ లేదు. క్షీణస్వరంతో 'ఎక్కడికి పంపిస్తా రంటావు?'—అంది. ఆ ప్రశ్న చూస్తే, ఆమెకది ఆలోచించవలసిన సంగతేనని తోచిం దనిపిస్తుంది.

జానకికి ధైర్యం చిక్కింది. తన మనస్సు లోని అనుమానాలను ప్రస్తావించసాగింది.

'అండమాన్, నికోబార్ ద్వీపాలు సముద్ర మధ్యంలో, ఉత్తర దక్షిణాలకి ఓ వెయ్యిమైళ్ళ పొడుగున, చిన్నా పెద్దా రెండు మూడు వేలవరకూ వున్నాయంటారు. ఏ దీవిలోనేనా వున్నారేమో...సాధ్యం కాదం టావా?'

భద్రకు ఆమెమీద విపరీతమైన జాలి కలిగింది. సాధ్యంకాదని చెప్పడానికూడా మనసొప్పలేదు.

'వెర్రిదానివి' — అంటూ కౌగలించు కొంది.

చాలసేపు ఇద్దరూ ఒకరినొకరు అనుకొని నిశ్శబ్దంగా కూర్చున్నారు. మరలా జానకే ఆరంభించింది.

'ఎక్కడికేనా కదులుతే చాలు—ముందు ఏయేకాగితాలు ఏం చెయ్యాలో, ఎవరికి ఏమేం ఇవ్వాలో అన్నీ వప్పగింతలు పెట్టే వారు. అనుకొన్న వేళకు రాకపోతే ఏం చెయ్యాలో చెప్పేవారు.'

భద్ర మామూలుగానే అనేసింది.

'మళ్ళీ రామనిపించింది కాబోలు,'

ఆ వప్పచెప్పడాలు మామూలేనంది జానకి.

'ఎందుకా వప్పగింతలు? పట్టుబడితే చంపేస్తారనే జ్ఞానం వున్నట్లే కద! కాని ప్రాణం అంటే తీపీ, చావంటే బెదురూ లేవా? అంత నిర్లిప్తంగా ఎల్లా వుండగలిగే వారు?'

తన ప్రశ్నకి తానే సమాధానం ఇచ్చు కొంది. 'ప్రజలకి. దేశానికి మంచి చేస్తున్నామనే విశ్వాసం! ఆ ప్రయత్నంలో మన ప్రాణం పోయినా ఫర్వాలేదనే నిర్లక్ష్యం! ...మొదట వెర్రి భయం వేసేది. ఏడుపు వచ్చేది. తిరిగొస్తే చంటిపిల్లలా కరుచుకు పోయేదాన్ని...'

ఆ మానసికాందోళన తీవ్రతను తన అనుభవాలతో భద్ర సరిచూసు కొంటూంది.

'క్రమంగా ఆ వప్పగింతలు అలవాటయి పోయాయి. భయంవెయ్యడం మానింది. తిరిగొస్తు సంతోషమూ కలగడంలేదు. ఏదిలోకి పోయి వచ్చినట్లే అనిపించసాగింది. కాని...ఒకమాటు...వెళ్ళిన మనిషి...మరి రాలేదు.'

జానకి నోట మాట తొక్కుపట్టినట్లు ఉంది. క్షీణస్వరంతో మూలిగింది.

'మరి...రానేలేదు.'

జానకి చాలసేపు ఏడ్చింది. ఏకతరబడి ఏడ్చుకొంటుంది తుదకూ తేకి అణచిపెట్టు



కొన్నాళ్ళు, ఒక్కసారిగా కట్టలు తెంచు కొని బయటకు పొంగినట్లయింది. భద్ర ఆమె కళ్ళు తుడిచి దగ్గరకు తీసుకొంది.

'ఇంతకాలం ఇంత బాధను ఎల్లా దాచు కొన్నావే తల్లీ !'

ఏదో జ్ఞాపకం వచ్చినట్లు జానకి వెక్కి పోయింది.

'ఆశ అనిపిస్తూంటుంది.

హఠాత్తుగా మాయమైన మనిషి అంత హఠాత్తుగానూ వచ్చేస్తారేమో, తీరా వస్తే? నేనక్కడ లేకపోతే ?...'

ఆమె బొంబాయినే కాదు, ఆ వీధిని ఆ యింటిని కూడ వదలలేక పోయింది. అక్కడే వుద్యోగం చేసుకొంటూ పై చదువులు చదివింది. ఆ చదువు మనస్సుకో వ్యాపృత్తి కలిగించడం కోసం. పరీక్షలు ప్యాసయింది. ఉద్యోగాలు మారింది, కాని యిల్లు మారలేదు, చాలకాలం...

ఆ ఆశ పోనేలేదు హైర్—పర్చేజి పద్ధతిలో ఫ్లాట్ కొనుక్కున్నా అది ఎవరికో అద్దెకిచ్చి తాను మొదటి చోటనే ఆ యింట్లోనేవుంది. ఆయిల్లు తీసేశారు. అప్పుడు తనయింటికి వెళ్ళినా వారానికి వోమారేనా పాతయింటి వీధికి వెడుతుంది. అక్కడున్నపార్కులోకూర్చునివస్తూంటుంది.

ఆకథవినిభద్రకూడా కళ్ళనీళ్ళు పెట్టుకొంది.

వారి కబుర్ల నడి విని పక్కగదిలో పడుకున్న సత్యానందం లేచి వచ్చాడు. లైటు వేసేడు. ఇద్దరూ కూర్చుని వున్నారు.

'మీరిద్దరూ నిద్రపోనేలేదా? ఎంత అయిందో చూసుకొన్నారా? రెండు దాటింది'

భద్ర కళ్ళు తుడుచుకుంటూ గోడనున్న గడియారం వంక చూసింది. సత్యానందం వూహించేడు.

'ఏమిటిది భద్రా! నువ్వు కూడానా? దానికి ధైర్యం చెప్పడానికి బదులు నువ్వూ ఏడుస్తున్నావూ?...బాగుంది వరస!...ఏమిటది జానకీ!'—అంటూ వూరడింపుగా తల నిమిరేడు.

'నాకొకరు ధైర్యం చెప్పాలిసిన అవసరం వుందా బావా! రాయయిపోయాకదా!' అని జానకి ఏడ్చింది.

'వూరుకో అలా కాగలిగితే మంచిదే. కావడం అవసరంకూడా, లేకపోతే మన దేశంలో ఒక్కరోజు బతకలేము'—అన్నాడు, సత్యానందం సగం వోదార్పుగా సగం విశ్వాసంతో.

(ఇంకా వుంది)

# ఎవరిని ప్రశంసించాలి?



బులుసు వేంకటరమణయ్య - ధర్మపథం

తగినవారిని కొనియాడినప్పుడే అది ప్రశంస అనిపించు కుంటుంది. అట్లు కాకుండా గుణవంతులు కానివారిని గుణవంతులనుగా వర్ణించడం ముఖస్తుతి అవుతుంది. ముఖస్తుతి చెయ్యడంలో వ్యక్తికి స్వార్థం కొంతవరకయినా ఉండి తీరుతుంది. అందువల్ల ముఖస్తుతి చెయ్యడం ఉత్తమ లక్షణం కాదు.

ఉత్తమగుణాలు కలవారిని ప్రశంసించవచ్చును. ఆ ప్రశంసించడంలోనూ ఔచిత్యాన్ని గమనించాలి. ఎవరిని, ఎప్పుడు ప్రశంసించడం ఉచితమో మన ప్రాచీనులు నిర్ణయించియే ఉన్నారు. ఎవరిని ప్రశంసించకూడదో—(అంటే ఉత్తమగుణాలు ఉన్నా కూడా) స్పష్టపరచి ఉన్నారు—

'ప్రత్యక్షే గురవః స్తుత్యాః
పరోక్షే మిత్రబాంధవాః
కార్యాంతే దాసభృత్యాశ్చ
నకదాచన పుత్రకాః'

గురువులను, వారియెదుటనే స్తుతించవలసి ఉన్నది. బంధువులను, మిత్రులను వారియెదుట కాకుండా పరోక్షంలో కొనియాడవలసి ఉన్నది. భృత్యులనూ, సేవకులనూ— వారికి అప్పగించినపనిని పూర్తి చేశాక అభినందించాలి. ఎంత గుణవంతులయి ఉన్నప్పటికీ పుత్రులను ఎన్నటికినీ ప్రశంసించనే కూడదు అని దీని అభిప్రాయం.

గురువులను సమ్మానించడం శిష్యుని ధర్మం. ఆరీతిని సమ్మానం అందరియెదుట జరిగితే శిష్యునికి ఆత్మతృప్తి కలుగుతుంది. ఆ స్తుతివల్ల గురువునకు ఎక్కువ ప్రయోజనం లేకపోవచ్చును. కాని శిష్యుని కృతజ్ఞత వెల్లడి అవుతుంది.

బంధువులనుగాని, మిత్రులనుగాని వారియెదుటనే పొగడితే అది ముఖస్తుతి అనుకోడానికి ఎంతో అవకాశమున్నది. వారి పరోక్షంలో ప్రశంసించినప్పుడే అది వాస్తవమైనదిగా నిర్ణయించుటకు వీలుపడుతుంది.

సేవకులకు ఏదయినా పనిని అప్పగించగా వారాపనిని చేస్తూ ఉండగా, నడుమ 'మీరు బాగా పనిచేస్తున్నారు' అని మెచ్చుకోకూడదు. పని పూర్తి అయిన తర్వాతనే ప్రశంసించాలి. నడుమనే ప్రశంసిస్తే, వారిలో అలసభావం ఏర్పడవచ్చు, యజమానుపని తృప్తికరంగా నెరవేర్చకపోతే ఆయనకు కోపం వస్తుందని భయభక్తులతో శ్రద్ధగా కార్యం నెరవేర్చడంలో వారికి శ్రద్ధ ఎక్కువ ఉంటుంది. పనిని జరిపిన తర్వాత ప్రశంసిస్తే — ప్రోత్సాహం కలిగి భృత్యులు కార్యాంతరంపట్ల ఎక్కువ శ్రద్ధ చూపగలరు.

అయితే, పుత్రులెంత గుణవంతులైనా, నలుగురిలోనూ పేరుతెచ్చుకుంటున్నా, వారిని మాత్రం తండ్రి ఎప్పుడూ ప్రశంసించనే కూడదు. 'పుత్రాదిచ్ఛేత్పరాజయం' అని తనకుమారుడు తనకంటె గొప్పవాడుగా ఉండాలనే తండ్రి కోరుతూ ఉంటాడు. తన్ను మెచ్చుకోలేదని కొడుకు తండ్రి విషయంలో దురభిప్రాయం కలిగిఉంటే ఉండుగాక! కొంత కాలానికయినా పుత్రుడు 'భారవి మహాకవి' రీతిని యథార్థాన్ని గ్రహించగలడు.

'ఆత్మా వై పుత్రనామాసి' అనేదాన్నిబట్టి తానే పుత్రుడుగా జన్మిస్తాడుగదా! కుమారుణ్ణి పొగడితే తన్నుతాను పొగడుకొన్నట్లే అవుతుంది. ఆత్మస్తుతి ఎంత మాత్రమూ తగదు. ●



# నీలకంఠం

ఊర్వశి

ఊరుచివర పడిపోతున్న ఒక్కొగా నొక్క మేడిల్లు, విరిగిపడే సముద్రపుటలలు బాధలతో కృంగి గాజు కళ్లలో ప్రాణాల నిలుపుకునే ముసలివాళ్ళు, కనిపించినపుడు నాలో ఏదో అనిర్వచనీయమైన బాధ కలుగుతుంది. నీలకంఠాన్ని చూచినప్పుడైనా అంతే!

ఒక్కొక్కప్పుడు కొందర్నిచూస్తే ఆత్మీయత, కొందర్నిచూస్తే ద్వేషం కలిగినట్లే నాకు నీలకంఠాన్ని చూచినపుడు సానుభూతి కలుగుతుంది. అపుడా సానుభూతికి అర్థంలేదు. అపుడాతన్నిచూచి సానుభూతిని చూపే అవసరంకూడా లేదు. కాని అతన్ని చూస్తే ఎందుకో జాలి కలిగేది. మనసులో దిగులుగా ఉండేది. ఏదో చెయ్యాలనిపించేది. నీలకంఠం నాకు గుర్తున్నంత వరకూ నవ్వతే. దాని అర్థం విచారంగా ఉండేవాడని కాదు. నాకన్నా పదిహేను సంవత్సరాలు పెద్దవాడైన నీలకంఠాన్ని చూస్తే మాత్రం ఎందుకో 'అయ్యో?' అనిపించేది ఏక్షణంలో అతన్ని చూచినపుడు నాకాతని మీద ఆ భావం కలిగిందోగాని, అదే భావం నాలో జీవితాంతం ఉండిపోతుందని నేననుకోలేదు.

నీలకంఠం నాకు బాగ గుర్తు. అతనిది కూడ మాఊరే. నీలకంఠాన్ని 'నీలయ్య' అనిపిలిచేవారు మా ఊళ్లో. నీలయ్య నాకు మిత్రుడిలాంటి వాడు. మామధ్య పదిహేను సంవత్సరాల తేడఉన్నా మామధ్య మిత్రత్వం ఏర్పడటానికి కారణం నీలయ్య చేతిలోనున్న బొమ్మల చెక్కే నేర్పరితనమే. నీలయ్య చక్కని కర్రబొమ్మల చెక్కేవాడు. అతని చేతిలో ఆడవాళ్ల బొమ్మలు చాల చక్కగా తయారయ్యేవి. ఆ బొమ్మలు నన్ను ఆకర్షించేవి. ఉద్రేకపరచేవి. అప్పుడు నాకు పదేళ్ల వయసు. ఆ వయసులో నేను నీలయ్యను అనుసరించ ప్రయత్నించటం చూచి నీలయ్య నాకు మట్టిబొమ్మలు చేయటం నేర్పాడు. నేను బొమ్మలనెంత బాగా చేయలేకపోయినా, చాల బాగున్నాయని మెచ్చుకుని, పరిచేసి అందరికీ బొమ్మల చూపి పొగిడేవాడు నన్ను. అందుచేతనే కాబోలు నీలయ్యపై నాకు చాలా అభిమానముండేది.

మా ఊరిచివర తోటదగ్గరి ఇల్లే నీలయ్యది. చిన్నప్పుడు ఎవరూలేనివాడైనాడు నీలయ్య. చిన్నప్పటినుండి అందరితో మంచిగా ఉండేవాడు. ఎవరితోనూ కయ్యానికి పోయేవాడు కాదు. రోజుకు మూడుసార్లు 'టీ' త్రాగటంతప్ప మరే దుర్వ్యసనం ఉండేది కాదు. అందంగా ఆరోగ్యంగా ఉండేవాడు. మావూరిలోజరిగే గౌరీపున్నమి ఉత్సవాలలో వేషాలువేసి యువకుల ఉత్సాహ పరిచేవాడు. కలా కపటం లేని నీలయ్యను మా వూరంతా ప్రేమించింది.

నీలయ్య వారింటిముందు పశువులశాల లాంటి పాక, ఆ పాకముందు వేపచెట్టు ఆ వేపచెట్టుకు ఒక ఉయ్యాల ఉండేది. సెలవురోజుల్లో మా పిల్లల మందరం అక్కడే ఆడుకునేవారం. మేమెంత అల్లరి చేసినా ఏమనేవాడు కాదు. ఇంటివెనుక పెద్దనుయ్యి నూతిప్రక్కన సపోటాచెట్లు, మామిడిచెట్లు ఉండేవి. ఇంటిముందువున్న పాకలో కర్రపని చేసేవాడు నీలయ్య. మాకు అందరికీ సపోటాలు కోసియిచ్చేవాడు. ఊళ్లో అమ్మించే సపోటాలను మాకు యిచ్చేస్తున్నాడే మరి యింకేమి అమ్ముతాడని నాకు జాలివేసేది. ఒకసారి నా జేబులోనున్న అర్ధణాతీసి అతనికిస్తే నవ్వుతూ అర్ధణాను జేబులోవేసి నన్ను ముద్దుపెట్టుకున్న దృశ్యం నాకు బాగ గుర్తు. నా పదేళ్ల వయసప్పుడు నీలయ్యపెళ్ళి చేసికుని నాగన్న అపస్వరాలతో పాడే సన్నాయి పాటలమధ్య కొండడు, తపుడులు డప్పులు వాయిస్తూంటే పెట్రొమాక్సు దీపాలమధ్య పల్లకిలో ఊరేగటం నాకింకా గుర్తే! నీలయ్య బొమ్మలు చెక్కుతూంటే ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయిన క్షణాలు నాకు బాగ గుర్తు. ఒకసారి నీలయ్య చాల రాత్రివరకు దీపంబుడ్డిదగ్గర కళ్లలో కళ్లు పెట్టుకుని బొమ్మలు చెక్కుతూంటే చూస్తూ గోనెంకంమీద అలా నిద్రపోయాను. ఎప్పుడు నిద్రపోయానో తెలియదుగాని మర్నాటి ఉదయం మంచంమీదనుండి లేస్తూ యింటిలోకి ఎలా వచ్చానా అని ఆశ్చర్యపోతూంటే మా అమ్మే చెప్పింది, నీలయ్యే నన్ను అంతక్రితం రాత్రి ఎత్తుకొచ్చాడని.

'పెళ్లయినవాడు త్వరగా నిద్రపోవాలని

సలహా నివ్వలేకపోయానా నీలయ్యకి?' అని మా నాన్నగారంటే 'అంతకన్నా పెద్ద సలహాలే యిచ్చాను' అంది మా అమ్మ. మా అమ్మ యిచ్చిన సలహాలుమాత్రం నాకు తెలియవు.

నీలయ్య పెళ్లాం సీత నాతో నవ్వుతూ మాటాడేది. మంచి మంచి కథలు చెప్పేది అప్పుడప్పుడు సపోటాలు కోసి యిచ్చేది. సీత తెల్లగా అందంగా నవ్వేది. సీత నవ్వుతూంటే బుగ్గలు సొట్టలు పడేవి. అప్పుడు సీత చాల బాగుండేది. నీలయ్య బొమ్మల్ని చూసే నాకు సీతనుచూస్తే సిగ్గేసేది. సీత నన్ను దరికి తీసికుని ముద్దాడితే సిగ్గుతో కుంచుకు పోయేవాడిని. నీలయ్య బొమ్మలు చెయ్యక కర్ర పనిచేసే రోజున నేను నీలయ్యతో పాకలో ఉండేవాడిని కాదు. అలాంటి రోజుల్లో సీత చెప్పే కథల విన టానికి నేనే దొరికేవాడిని. సీత కల్పించి ఎన్నోకథలు చెప్పగలిగేది. రాజకుమార్తెను రాజకుమారుడు అర్ధరాత్రి గుర్రంమీద తీసికెళ్ళిపోయిన కథలనెన్నో చెప్పింది సీత నాకు. ఉదయం పాకలోకివెళ్తే మళ్ళా రాత్రి ఎన్ని గంటలకు ఇంట్లోకి వచ్చేవాడో అతనికి తెలియదు. ఇంట్లోంచి ఏ వస్తువు కావలసి వచ్చినా నేనే సీతనడిగి తెచ్చేవాడిని.

సీత ఒక విధంగా పట్నవాసపు పిల్ల అవటంచేత, నగలన్నా, బట్టలన్నా, సింగారించుకోవటమన్నా మోజు పడేది. నీలయ్య భార్య సరదాల తీర్చ ప్రయత్నించేవాడు. బండి కట్టించి ఊరికి నాలుగుమైళ్ల దూరంలోనున్న టూరింగ్ సినిమాహాలుకు సినిమా చూపించటానికి సీతను తీసికెళ్లేవాడు; తనకంత సరదాలేకపోయినా వారానికి ఒక సినిమా అయినా చూస్తేగాని ఉండలేని సీతను సినిమాలకు తీసికెళ్ళటం బాధగా ఉండేది నీలయ్యకు. సీతకు సినిమాలపైనున్న మోజు ఆపలేనిదని తెలిసి మావూరి ఆడవాళ్ళు సినిమాల కెల్తూంటే వారితో పంపేవాడు. నడిచివెళ్లి సినిమా చూచి నడిచివచ్చే భార్యనుచూచి జాలిపడేవాడు నీలయ్య. సీత సినిమాపాటల విన్నవి విన్నట్లుగా పాడేది. సినిమాబండి వీధిలోకి వస్తే చిన్నపిల్లలాగ వీధిలోకి పరుగెత్తిపోయేది. సినిమాలోవాళ్ళు అలంకరించుకునేటట్లు అలంకరించుకునేది సీత. సీతకున్న సినిమాపిచ్చిని చూచి విసుగుకునేవాడు నీలయ్య. సినిమాపిచ్చి మాన్పడం కోసం డబ్బులు యివ్వడం మానేశాడు నీలయ్య. అయినా సీత సినిమాలకెళ్లేది. ఎక్కడివి డబ్బులు అని అడిగితే తాను అప్పుడప్పుడు దాచుకున్నడబ్బులు అనేది సీత. ఒకటి రెండుసార్లు సీత నాతో అంది 'నేను సినిమాలో చేరతాను తెల్సా!' అని. తెరమీద బొమ్మలు ఎలా ఆడతాయో తెలియని నేను సీత తెరమీదకు ఎలా చేరుతుందో తెలిసికోలేక పోయాను. అప్పటికి ఒక కూతురు కొడుకు ఉండేవారు నీలయ్యకు. వాళ్ళను సరిగా చూచేది కాదు సీత. నీలయ్యే వాళ్ళకు కావలసినవి చూచి పాకలో తనతో ఉంచుకునేవాడు. ఆ విషయంలో సీతమీద కోపం వచ్చేది. ఒకసారి నిజంగా కోపం వచ్చింది సీతమీద నాకు. నన్నుచూచి నవ్వేసీత ఆరోజు నేను వార్నీసు డబ్బాకోసం ఇంటిలోకి వెళ్ళబోతూంటే గబగబా గది ఇవతలికి వచ్చేసి నన్ను అవతల నిలబెట్టి విసుక్కుంటూ వార్నీషు డబ్బా నిచ్చేసి పంపేసింది. నాకు చాల బాధ వేసిందానాడు. నేనేం తప్పుచేశానని అలా చేసిందో అర్థంకాలేదు నాకు. నేను మౌనంగా ఉండటం చూచి 'నిన్నెవరైనా అన్నారా? తంతానులే!' అని నీలయ్య అన్నాడు. రెండుమూడు రోజులు నేను నీలయ్య పాకవైపు వెళ్ళలేదసలు. మూడవ రోజున నీలయ్య పాకవైపు వెళ్ళిన నేను నీలయ్యచేతిలో కర్రనుచూచి కంగారు పడ్డాను. నే వెళ్లేసరికి నీలయ్య కోపంతో మండిపోతున్నాడు. నీలయ్య ముందు సీత జుట్టు విరబోసికుని ఏడుస్తోంది. మధ్య మధ్య కోపంగా సమాధానాలనిస్తోంది. నాకు పరిస్థితి అర్థం కాలేదు. నీలయ్య అవే మాటలు బాగ గుర్తుండి ఉంటే అసలు సంగతిని బాగా చెప్పగలిగేవాడిని.

నీలయ్యమాత్రం 'నీకేం తక్కువ చేసా

# ఓం నమః శివాయ

కం॥ ఉమేశాభక్తితో గొల్చితి
ఉత్తేజ ఉత్కంఠ ఉదారనుత్తమమరాళీ
ఉర్విలో వున్నావని,
ఉద్దండ దండప్రచండ, ప్రతిభ స్ఫురించుచుంటిన్॥

కం॥ ఊగెద నుయ్యాలలోన
ఊహించే చతురచామంతి చైతన్యసుగాను
ఊరటే ఉపాయము
ఊర్జిత పాపనాశనా నిన్నే ప్రణతింతున్॥

కం॥ ఋణగ్రస్తను కాలకంఠా
ఋణానుబంధ విలోకింప నాతరమా
ఋణమో తృణమో తెల్పు,
ఋణగుణగ్రహణ గ్రహితజ్ఞాన గౌరీశంకరా॥

కం॥ ౠపములేని లింగన్నవు
ౠపునిర్ధారణ నిరూపింప నసమర్థన్
ౠపుమాపుదు రేల
ౠపుచూపుతేల నిరాకార నిరంజనా॥

రచయిత్రి: శ్రీమతి సరస్వతీగిరి

[illegible] నాకే అన్యాయం తలపెట్టాడని అనటం మాత్రం నాకుగుర్తే! ఆరోజంతా చిరాకుగా ఉన్నాడు నీలయ్య. బొమ్మలేవీ చెక్కలేదు. సాయంత్రం నే వెళ్ళేసరికి నీలయ్య పాకలో లేడు. ఇల్లు నిశ్శబ్దంగా ఉంది. నెమ్మదిగా ఇంటిలోకి వెళ్ళాను. లోపలికెళ్ళిన నాకు మామిడి చెట్టుక్రింద సీత కనుపించింది; బడ్డికొట్టు వీరడి చేతుల్లో ఒంటిమీద బట్టలు సరిగా లేక. ఆవిధంగా కనిపించిన సీతను చూడగానే అసహ్యం కలిగింది. నీలయ్యమీద చెప్పలేని సానుభూతి ఏర్పడింది. చెట్టు ప్రక్కనుండి వీరడు తిరిగి తలఎత్తుతూంటే వాడు నన్నెక్కడ చూస్తాడోఅని భయపడుతూ మాయింటివైపు పరిగెత్తాను.

వీరడు ఆరోజుల్లో పేరుపొందిన రౌడీ. ఒకప్పుడు వాడికి చిన్నబడ్డీ కొట్టు ఉండేది. అందుచేత వాడికి బడ్డీకొట్టు వీరడు అనే పేరు నిలిచిపోయింది. కోరమీసంతో, ఉంగరాల జుట్టుతో, కండలు తిరిగిన శరీరంతో అందంగానే ఉండేవాడు. కాని వాడికళ్ళు ఎర్రగా భయాన్ని కలిగిస్తూ ఉండేవి: కర్రసాము చేయటంలో వాడిది అందెవేసిన చెయ్యి. అమ్మవారి పండుగలలో, గౌరీ పున్నమి ఉత్సవాలలో వీరడి గరిడీ లేకుండ ఉండేదికాదు. ఆడపిల్లలకు వాడిని చూస్తే భయంగా ఉండేది. పదిమంది ఆడవాళ్ళు కలిస్తేనేగాని నీటికోసం చెరువు కెళ్ళేవారు కారు. నీలాటి రేవులో ఆడవాళ్ళు స్నానాలు చేస్తూంటే చింతచెట్టుక్రింద చుట్టకాలుస్తూ చీరలువొలిచే చూపులతో ఆడవాళ్ళవైపు చూచేవాడు. వాడిచేతిలో ఎప్పుడూ కర్రఒకటి ఉండేది. ఒంటరిగా ఆడది కనిపిస్తే వదిలిపెట్టేవాడు కాదని; నేను మరీ చిన్నపిల్లవాడినై ఉన్నప్పుడు, ఒకనాటి మధ్యాహ్నం—పన్నెండు గంటలవేళ ఒక కన్నెపిల్లను దారుణంగా చెరచాడని, ఆమె ఆ అవమానాన్నిభరించలేక ఆ చెరువులోనే పడి ప్రాణత్యాగం చేసికుందని నేటికీ మావూళ్ళో చెప్పుకుంటారు. అయితే వాడిని మనసులో తిట్టినా, పైకి అనటానికి ఎవరికీ సాహసం లేదు. డబ్బున్న వాళ్ళకు వాడి అవసరాలు చాలఉన్నాయి. ఆడవాళ్ళను కార్చటం, హత్యలు చేయటం వాడికి కిస్తుతోపెట్టిన విద్యలు, కల్లుతో తాగిన సరదాలు. వాడివల్ల మావూరికి ఉపకారం లేకపోలేదు. వాడుంటే దొంగ అనేవాడు మావూళ్ళోకి ప్రవేశించేవాడుకాదు. అలాంటి వీరడితో ఉన్న సీతను చూచిన తరువాత 'అయ్యో!' అనే భావం నాలో కలుగకపోలేదు. నాకు సపోటాలు కోసి యిచ్చిన సీతేనా ఈసీత, భర్తతో తీయగా మాటాడే సీతేనా ఈవిధంగా కనిపించినది అని అనిపించింది నాకు.

ఇంటివైపు పరుగెత్తిపోతున్న నాకు సీతప్ప బడ్డీదగ్గర పిల్లలకు జంతికలు కొనిపెడుతూ నీలయ్య కనిపించాడు. నీలయ్యను చూచిన తరువాత నీలయ్యకు జరుగుతున్న అన్యాయాన్ని దాచుకో బుద్ధికాలేదు. నీలయ్యను రహస్యంగా పిలిచి 'నీలయ్యా!...మీసీత...వీరడు...మామిడి...' అని నేను చెప్పబోతూంటే జేవురించిన ముఖంతో పిల్లల తీసికుని చరచర వెళ్ళిపోయాడు నీలయ్య. ఆ తరువాత ఏమి జరిగిందో నాకు తెలియదు. మూడవరోజు ఉదయాన్నే 'వీరడు–సీతను లేవదీసికుని వెళ్ళిపోయాడని, అసలు అంతకుముందు ఆరునెల్లనుండీ వాళ్ళకు సంబంధముందని' మా పనిమనిషి మాయింట్లో చెప్తూంటే విన్నాను. ఆమాటల అర్థం స్కూల్లో మాకన్నా పెద్దవాడైన మురళీ తన ఈడు వాళ్ళతో చెప్తూంటేగాని తెలియలేదు. అయితే సీతను వీరడు లేవదీసికొని పోయినందుకు నాకేమీ విచారం వేయలేదు. ఊరికి వీరడిపీడ వదిలిపోయిందనిపించింది. కాని నీలయ్యను చూచినతరువాత గుండె చల్లబడి పోయింది. మౌనంగా తన పిల్లలతోపాటు నన్ను దగ్గరికి తీసుకుని తల నిమిరాడంతే. ఆనాడు తెలిసింది నీలయ్యమీద నేనెందుకు సానుభూతిని చూపుతున్నానో.

వారం రోజులవరకూ నీలయ్య ఎక్కడికీ పోలేదు. బొమ్మల చెక్కడం మానేసి ఎటో చూస్తూ కూర్చునేవాడు. వారం రోజుల తరువాత నీలయ్య ఊరువిడిచి వెళ్ళిపోయాడని చెప్పుకున్నారు. ఆవిషయం తెలిసిన వెంటనే నీలయ్య ఇంటికి పరుగెత్తాను. ఇల్లు, పాక బావురుమంటూ కనిపించాయి. వేపచెట్టుక్రింద ఉయ్యాల బోసిపోతూ కనిపించింది. నాకళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఇంటికి తిరిగివచ్చాను. ఒకప్పుడు నా పుట్టిన రోజుకని నీలయ్య నాకు కానుకగా యిచ్చిన బొమ్మ మాత్రం నీలయ్యకు బదులుగా నాదగ్గర ఉండిపోయింది; నాబాధను త్రవ్వుతూ.

అయితే నీలయ్యగురించి యింత కథను చెప్పే అవసరం ఏమిటో అని మీరంతా అంటే బహుశా నీలయ్యమీద ఏర్పడిన సానుభూతే కారణమేమో. ఈమధ్య నాలుగు సంవత్సరముల క్రితం నీలయ్య నాకు కనపడకపోతే నేనీకథను మీకు చెప్పేవాడినే కాదు.

సింహాచలంనుండి పాడేరుకు ఇంజనీరింగ్ సూపర్‌వైజర్‌గా వెళ్ళిన మొదటిరోజునే బస్సుదగ్గర కలిశాడు నీలయ్య. సుమారు పదమూడు సంవత్సరాల తరువాత కలిశామన్నమాట. నన్ను గుర్తుపట్టి ఆనందంతో పరుగెత్తుకుంటూ వచ్చాడు నీలయ్య. నేను సుమారు అదేస్థితిలో ముందు కురికాను. నీలయ్య అడక్కముందే నా బదలీ గురించి చెప్పాను. అప్పటికే రాత్రి ఎనిమిది గంటలయింది. 'రా బాబూ! ఈరాత్రి మా యింటనేఉండి ఉదయాన్నే అందర్నీ కలియవచ్చు' అన్నాడు: పాడేరు ఘాటీ పైద ప్రయాణంతో పేగులు కదలిపోయినట్టుంటే చలిలో నీలయ్యవెంట వెళ్ళాను నీలయ్య యింటికి. ఊరుచివర ఉంది నీలయ్య యిల్లు. ఇంటి వెనుక తోట ఏదో ఉందని చెప్పాడు నీలయ్య. అక్కడనుండి మాబస్సు వచ్చినదారి కొండలు లీలగా కనిపించసాగాయి. ఇళ్ళలో దీపాలు మినుకు మినుకు మంటూంటే, ట్రాన్సిస్టర్‌రేడియో లోంచి శివరంజని రాగంతో పాట వినవస్తూంటే అక్కడికి కొద్దిదూరంలోనున్న దేవాలయంలోనుండి గంటలు వినిపిస్తూంటే నేనొక కొత్తప్రదేశంలో ఉన్నానన్నది జ్ఞాపకానికి వచ్చింది. ఎనిమిదిగంటలకే ఊరు జన సంచారం లేనిదైంది. కప్పల అరుపులతో, కీచురాళ్ళ ధ్వనులతో వాతావరణం నిండిపోయింది. నీలయ్యది పూరిల్లే అయినా, అందంగా, పరిశుభ్రంగా ఉంది లోపల. ఇంటిలో ముందుగదిలో ఒక టేబులు, కుర్చీ, మంచమొకటి ఉన్నాయి. టేబిలు ముందు హరికన్‌లాంతరు వెలుగుతోంది. ఆ బల్లముందు ఒక కుర్రవాడు పుస్తకాలు ముందేసికుని చదువుకుంటున్నాడు. గోడ నానుకుని కూర్చుని పదహారేళ్ళ అమ్మాయి అల్లిక పుల్లలతో ఏదో అల్లుతోంది. నేను

# ఇంకో ప్యారీ మిఠాయి తినాలని ఆశ!




పిల్లలు ప్యారీ మిఠాయిలు ఎప్పుడూ కావాలనే అంటూ వుంటారు. పిల్లలు అతివేగంగా కోల్పోయే శక్తిని ప్యారీ మిఠాయిలు భర్తీ చేస్తాయి. ప్యారీ మిఠాయిలు తాజాయైనవి, పుష్టికరమైనవి, చప్పరించకుండా వుండలేనంత రుచికరమైనవి.

PRS/6395

తయారుచేయువారు: ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

ఇంటిలోకి రావటం చూచి ఆ అమ్మాయి మెల్లిగా ఇంటిలోపలికి వెళ్ళిపోయింది. 'అది నా కూతురు బాబూ! అహల్య. వాడు నా కొడుకు చంద్రం. మరచిపోయారేమో!'

# నీలకంఠం

అన్నాడు వాళ్ళను నాకు పరిచయం చేస్తూ. ఆ కుర్రవాడు నన్ను కొత్తవానిని చూచి నట్టు చూశాడు అహల్య వంటింటి కిటికీ లోంచి చూడటం నే గమనించాను. దీపపు వెలుగులో మెరిసే ఆ కళ్ళను చూడగానే నాకు సీత జ్ఞాపకమొచ్చింది. ఆ కళ్ళే అంత అందంగా ఉంటే అహల్య చాల అందంగా ఉంటుందని అంచనా వేశాను. సుమారు ఒక అరగంట తన కొడుకు చదువు గురించి, తన వ్యాపారం గురించి చెప్పాడు. సీత గురించి నీలయ్యేమీ అడుగ లేదు. నేనేమీ చెప్పలేదు.

'నాన్నగారూ! రమ్మనండీ నీళ్ళు కాగి పోయాయి' అంది అహల్య. మొదట అది అహల్యగొంతు అనుకోలేదు. ఏదో అద్భుత మైన సంగీత పరికరమూ పలికినది అని పించింది. చలి బాగ ఉండటంచేత నేను వేడినీటి స్నానానికి అభ్యంతరం చెప్పలేదు. నేను స్నానంచేసి వచ్చేసరికి భోజనం వడ్డించి సిద్ధం చేసింది అహల్య. అహల్య చేతిమీద నెయ్యి వేస్తూంటే 'ఈ చేతు లతో పిల్లలకు అన్నంముద్దలు తినిపించాను. ఇప్పుడు ఇదే వండిపెడుతున్నది. ఏమిటో చిన్నతనంలోనే దీనికీ బాధ్యత. ఇక ఎంత కాలంలే బాబూ! దీనిని ఒక అయ్యచేతిలో పెడితే నా బాధ్యత తీరుతుంది. చంద్రం నా ముసలితనంలో గొంతులో నీళ్ళు పొయ్యక పోడు' అని అన్నాడు నీలయ్య.

'నీకేం! నీలయ్యా? నీవు చాల అదృష్ట వంతుడవు. నీ పిల్లలు వజ్రాలు. మీ అమ్మాయికి చక్కని మొగుడు వస్తాడు. నీకు గుణవతి అయిన కోడలు వస్తుంది. అప్పుడేమిటో అలా జరిగిపోయింది. విధి వైపరీత్యం. అంతే!' అని అన్నాను. నా మాటలకు అహల్య సిగ్గుపడుతూ గోడ కానుకుని నిల్చుండిపోయింది. అహల్యను క్రీగంటే చూడగలిగినప్పటికీ అహల్యను చూస్తూంటే అజంతా శిల్పమే జ్ఞాపకము వచ్చింది. హరికన్‌లాంతరు వెలుగులో మెత్తని బంగారంలా మెరిసిపోసాగింది అహల్య. అహల్య అందంముందు, నా జ్ఞాప కాలలో లీలగా మిగిలిన సీత తీసికట్టే ననిపించింది. నీలయ్యకున్నట్టె పలుచని పెదిమలు, అందమైన కనుబొమ్మలు కలి అహల్య నన్ను ఆకర్షించిన మాటమాత్రం వాస్తవం.

భోజనమయిన తరువాత రాత్రి నిద్ర పోయే సమయానికి నా ప్రక్కనవచ్చి కూర్చు న్నాడు నీలయ్య. దీపాన్ని తగ్గించి చాల రహస్యంగా అడిగాడు. 'సీత ఎప్పుడైనా అక్కడికి వచ్చిందా బాబూ!' అని వణికే గొంతుకతో. నీలయ్య ప్రశ్నకు సమాధానం నాకు తెలుసు. కాని ఆ సమాధానాన్ని విని నీలయ్య తన్ను నిగ్రహించుకోగలడా? బాధను భరించగలడా అనేదే నా సంశయం. నీలయ్య మా వూరిలో తలయెత్తుకుని తిరగలేక వూరిని విడిచిపెట్టిన ఆరునెల లకే మా వూరొచ్చింది సీత. అంతకు ముందే వీరడు మా ఊరు రావటం, ఊరంతా వాడిని 'సీత ఏదిరా?' అని అడగటం, సీత తనకు తెలియదని, సీతకు తనకు సంబంధంలేదని వాడు దబాయించటం జరిగాయి. సీత వస్తూనే నీలయ్య పాకకు వచ్చింది. నీలయ్య లేడని తెలిసికుని లబో దిబోమని ఏడిచింది. ఎవరు ఏమి చెప్పినా ఏడుపును మానిందికాదు. 'ఇంటి చుట్టూ రోజంతా తిరిగింది. సీత పరిస్థితి చూచి హృదయము ద్రవించిన పెద్దలు సీతను ఏలుకొమ్మని వీరడికి చెప్పారు. సీత ఎవరో తనకు తెలియదని వీరడు బుకాయించటం ఊరంతటికీ చిచ్చుపెట్టింది. భోజనం చేయక రోజంతా అక్కడే తిరిగి అప్పటికే నెలలు నిండిన సీత, పశ్చాత్తాపంతో నీలయ్యయింటి వెనుకనున్న నూతిలోపడి మరణించటం, అలా ఆత్మహత్య చేసికున్న సీత నీలయ్య యింటిముందున్న చింత చెట్టుమీద దయ్యమై ఉన్నదని మేమంతా భయపడి, ఆ ప్రక్కకు వెళ్ళటం మాను కోవటం జరిగాయి. ఇప్పటికీ పల్లకీలో ఊరేగుతున్న సీత, నూతిదగ్గర ప్రాణం పోయి పడిఉన్న సీత నా కళ్ళకు కదుతూనే ఉంటారు. సీత అంత దారుణంగా మర ణించిన విషయాన్ని విని నీలయ్య భరించ గలడా అని అనుమానిస్తూ 'నేనున్నంత కాలం సీత రాలేదు నీలయ్యా!', అని అబద్ధమాడాను. ఇక్కడొక చిన్న విషయం చెప్పాలి. నీలయ్య దగ్గర, సీత దగ్గర చనువు ఉండటంచేత చిన్నతనం నుండి అలవాటు అయి ఉండటం చేత సీతను 'సీత' అనే పిలవటం అలవా


ఉచితం

సుమారు 80 పై. విలువగల

మీడియం సైజు కోల్గేట్ డెంటల్ క్రీమ్




ప్రతి

కాశ్మీర్ బొకే




పుష్పతాజా తనంతో, పువ్వు సౌరభంతో కాశ్మీర్ బొకే మిమ్మల్ని ముగ్ధులను చేసే మనోహరమైన కుసుమ పరి మళాలు. నేడే ఈ అద్భుతమైన అవకాశాన్ని వినియోగించుకోడానికి త్వరపడండి. సరుకు పరిమితం.

టయింది:

'ఆ దుర్మార్గుడు' పళ్ళు కొరుకుతూ అన్నాడు నీలయ్య. 'సీతను ఏనాడూ సుఖపెట్టి ఉండడు. సీతను ఏనాడో వదిలిపెట్టి ఉంటాడు. సీత అమాయకురాలు. దానికేం తెలియదు. ఏమైందో ఏమిటో! నా సీత ఏమైందో ఏమిటో' అంటూ ఏడుస్తూ చేతుల్లో తలను దాచుకున్నాడు.

నీలయ్యను ఎలా సముదాయించటమో నాకు తెలియలేదు. మర్నాడు ఉద్యోగంలో చేరాను. నీలయ్యే మంచి యిల్లు చూచిపెట్టాడు. నా పదివిని చూచి నాకు అన్ని విధాల సహాయం చేయ ముందుకొచ్చింది ఊరు. నిముషాల మీద పరపతి ఏర్పడింది. తీరికవేళలలో నీలయ్య యింటికి వెళ్ళేవాడిని. బొమ్మలు చెక్కుతునో, వడ్రపని చేస్తునో కబుర్లు చెప్పేవాడు నీలయ్య. కర్ర బాగా దొరకటం చేత, పనితనం ఉన్న నీలయ్య, బాగానే డబ్బు నార్జించసాగాడు. అహల్యకు సుమారు పది పన్నెండు తులాల నగలు చేయించాడు. పిల్లలకు మంచి బట్టలు కొన్నాడు. ఇల్లు కొన్నాడు. నీలయ్య చేతి క్రింద ఒకపని కుర్రవాడు కూడ ఉన్నాడు. నీలయ్య చాల హాయిగానే ఉన్నట్లు అందరికీ అనిపిస్తుంది. కాని నన్ను చూడగానే (బహుశా సీత జ్ఞాపకం వస్తుందేమో) కంఠంలో హాలాహలం ఉన్నట్లు బాధపడుతూ కనిపించేవాడు. నన్ను చూస్తే నీలయ్యకు పాత విషయాలు జ్ఞాపకానికి వచ్చి బాధ పెడతాయని తెలిసి, అహల్యను చూడాలని ఉన్నా యింటికి వెళ్ళేవాడిని కాదు.

తీరిక ఉన్నప్పుడు స్కెచ్ బుక్కు, పెన్సిలు పట్టుకుని కొండలవైపు వెళ్ళిపోయేవాడిని. కేంపుకెళ్ళినా ఆ పుస్తకం నా దగ్గరుండేది. కొండ ప్రాంతపు స్త్రీలనే నమూనాగా ఉంచుకుని నా బొమ్మలకు లావణ్యం నేర్పాను. గీతల బలంగా నిర్దుష్టంగా, స్పష్టంగా గీయటం తెలిసొచ్చింది నాకు. బొమ్మలు చేతులు కాళ్ళు కట్టిపడేసినట్లు కాక చాల లలితంగా, అనాయాసంగా కదలటం ప్రారంభించాయి. వ్యర్థమైన గీతల తుడిచి పారేసిందక్కడే. రమణీయమైన ప్రకృతిని రంగురంగులలో తీర్చి దిద్దగలిగాను. కొండస్త్రీలు, పురుషులు నా కాగితాలపై నిలిచారు. కాని ఒక నాటి సంఘటన మాత్రం నన్ను నాదు కలచి వేసింది.

**ఒకనాటి _ మధ్యాహ్నం ఒక పల్లె[illegible]** నుండి వచ్చేస్తున్నాను సైకిలుపై. కొండ రాళ్ళ మధ్య నిలచిన చల్లని నీటి మడుగులో చేరి నిర్భయంగా స్వేచ్ఛగా, స్నానం చేస్తోందా ఏకాంత సమయంలో ఒక స్త్రీ. ఆ ఎండవేళ చల్లని నీటిలో స్నానం చేయటం వలన కలిగిన హాయి ఆమె ముఖంలో ప్రస్ఫుటం కాజొచ్చింది. తడిసిన శిరోజాలను వీపుపైన, నగ్నంగా ఉన్న రొమ్ముపైన వదలి వేలికమ్మల మధ్య చిక్కుడి పోయిన శిరోజాల సరి చేసికునే తీరులో ఆమె నిలబడిన భంగిమ అద్భుతంగా, అనిర్వచనీయంగా విలసిల్లింది. ఆ భంగిమ ఇంతవరకూ ఏ చిత్రకారుడూ ఊహించలేదు. నిర్వచించలేదు. నాకు లభించిన అవకాశాన్ని విడువదలచుకోలేదు. సైకిలు దిగి స్కెచ్ బుక్కు పైనే చూచిన దృశ్యాన్ని గబగబా రచించి సైకిలెక్కాను. ఊళ్లో ప్రవేశించిన నాకు అహల్య యింటి ముందు నిల్చుని కనిపించింది. అహల్యను చూచి సైకిలు దిగి ఇంటిలోకి వెళ్ళాను. నీలయ్య అనకాపల్లి వెళ్ళాడని అతని కోసమే తానెదురు చూస్తున్నదని చెప్పింది. అహల్య కళ్ళనే తనివితీర చూడాలనిపిస్తూంటే అహల్యను వదలి రాబుద్ధి కాలేదు. ఆ రోజు రాత్రి జలకమాడుతున్న స్త్రీ మూర్తిని తీర్చి దిద్దబోగా ఆ చిత్రం పూర్తిగా



ఇటీవల నటనాలయ నాటక కళా పరిషత్తు (ఖర్గపూర్) నిర్వహించిన నాటక పోటీలలో ఉత్తమనటిగా ఎన్నికైన కుమారి కె. సుజాత ('నాటకం'లో ఊర్మిళ పాత్రధారిణి)

**అహల్య రూపాన్ని సంతరించుకోవటం** చూచి, నాలో అహల్య ఎంత గాఢంగా నిలచినదీ తెలిసి పరితాపం చెందాను. ఆ చిత్రంలో అహల్య ఒక నమూనాగా నిలువలేదు. నా మనసుకు ప్రతిగా నిలిచింది. బొమ్మపై గీతలు దిద్దుతూంటే అహల్యను ముట్టుకున్నంతగా బాధ పడ్డాను. అహల్యను మనసార కోరుతున్న విషయం నాకు స్పష్టపడింది. నేను అహల్యను ప్రేమించాను. ఆ విషయం నాకు తెలుసు. అంతకన్నా కఠినమైన సత్యము యింకొకటి తెలుసు. అహల్య గగనకుసుమం. అహల్యను కోరటం అనుచితం. కులం కాని కులంతో వివాహానికి నీలయ్య యిష్టపడడు. సీత పాలిట వీరడు దాపురించి నీలయ్యను అన్యాయం చేసినట్లే, అహల్య పాలిట నే దాపురించి నీలయ్యను అన్యాయం చేయదలచలేదు. నీలయ్య ఆశలను వమ్ము చేయదలచలేదు. అహల్యను చూడాలని నా మనసు పదే పదే కోరుతున్నా, రెండు రోజులు కనిపించకపోతే నీలయ్యతో పాటు అహల్య— 'ఎందుకు చాలా కాలంనుండి నల్లపూసలా కంటికగుపించటం లేద'ని నిలవదీస్తుందని నాకు తెలిసినా, రోజు కొకసారైనా కనిపించండని అహల్య చేసిన హెచ్చరికలు చెవిలో గింగురు మంటున్నా అహల్యకు సాధ్యమైనంత దూరంగా వుండసాగాను. ఆమెను మరచిపోవాలని ప్రయత్నం. అహల్యకు పెళ్ళయితే ఆమె గురించి అంతగా ఆలోచించననే నమ్మకం ఏర్పడింది. నీలయ్యకు అహల్యకైన వరాన్వేషణలో నేనూ చేయూతనిచ్చాను.

నా ప్రయత్నం ఫలించింది. విశాఖపట్నంలో మంచి సంబంధం తటస్థపడింది. ఆ కుర్రవానికి ఒక కిళ్ళీ దుకాణం వుండటం, అతను బాగా డబ్బు నార్జించి వుండటం, ఆర్జించినది జాగ్రత్తగా దాచి మంచి ప్రయోజనాల కుపయోగించటం చూచిన తరువాత నీలయ్య ఆ సంబంధానికి అంగీకారాన్ని తెలిపాడు. పెళ్ళి వైభవంగా జరిపించాడు నీలయ్య. అహల్యను ఆమె భర్త ప్రక్కన చూచిన తరువాత అహల్య చాల అదృష్టవంతురాలనిపించింది. పిల్లలను విడిచి వుండలేని నీలయ్య యిల్లు, వాకిలి అమ్మేసి విశాఖపట్నానికి మకాం మార్చాడు. అక్కడే చిన్న షాపు పెట్టి ఫర్నిచర్ చేసి అమ్మసాగాడు. ఆ మరుసటి సంవత్సరమే **[illegible] నుండి సంబంధం తెచ్చి చంద్రా**

లికి వెళ్ళి చేశాడు నీలయ్య. నేను పాడేరు నుండి విశాఖపట్నం వెళ్ళినప్పుడల్లా నీలయ్యను కలిసేవాడిని. చంద్రం తండ్రికి చేదోడువాదోడుగా వుండి వ్యాపారాన్ని అభివృద్ధి చేస్తూంటే, అహల్య భర్తతో ఆనందంగా కాపురం చేసుకుంటూంటే నీలకంఠం ముఖంలో ఆనందాన్ని చూశాను. సీతకు దూరమైనాడన్న బాధ అతనిలో మరుగు పడిందని నేననుకొనేవాడిని. ఒకటి రెండు సార్లు అహల్య ఇంటికి తీసికెళ్ళాడు నన్ను. అల్లుడు కూతురు అన్యోన్యంగా వుండటం గురించి చాలా చెప్పేడు నీలయ్య. నీలయ్య ముఖంలో ఆనందాన్ని చూచిన తరువాత నాకేదో నిధి దొరికినట్లయింది. కాని మరో ఆరు నెలలకే పరిస్థితి తారుమారవటం చూచి దిగ్భ్రాంతి చెందాను. అహల్య భర్త ప్రమాదవశాత్తు లారీ క్రింద పడి మరణించటం, అహల్య నీలయ్య యింటికి చేరటం చూచి నీలయ్యపట్ల దేవుడు ఎంత క్రూరుడైనాడో అనిపించింది. నీలయ్య మానసిక వేదనను, అహల్య కన్నీటిని చూస్తూ నా తరం కాలేదు.

ఇంటికి తిరిగివచ్చిన నన్ను నాబొమ్మలు వెక్కిరించాయి. అహల్య రూపాన్నే దిద్దుకొన్న బొమ్మలు నా బాధను మరింత త్రవ్విపోశాయి. కుంచెలను, రంగులను పెట్టె అడుగున పడేశాను. ఏ మాత్రం తీరిక దొరికినా అహల్యకు జరిగిన అన్యాయమే గుర్తుకొచ్చేది. ఒకరోజు నీలయ్య యింటికి వెళ్ళాను. నీలయ్య యింట్లో లేడు. అహల్య విషాదాన్ని మరచిపోయినదానిలా నవ్వ ప్రయత్నిస్తూ నన్నాహ్వానించింది. చంద్రం, చంద్రం భార్య ఇంట్లో లేకపోవటం చేత అహల్యతో ఏకాంతంగా మాట్లాడ వీలు కలిగింది.

'నీ పరిస్థితికి కారకుణ్ణి నేనే' అన్నాను సంభాషణను ప్రారంభిస్తూ.

'ఈ సంబంధాన్ని కుదిర్చింది నేను.'

'అలా అనకండి. చాల తప్పు. మీరు నేను సుఖపడతాననే చేశారు. నా నుదుటి గీతకు మీరెలా బాధ్యులవుతారు?' అంది అహల్య వైరాగ్యం ధ్వనించే కంఠంతో. ఆ మాటలు వింటూంటే రెండు రెట్లు వయసు పొందిన దానిలా కనిపించింది అహల్య.

'నిజం అహల్యా! నీ పరిస్థితికి నేనే కారకుడను. వీరడివల్ల మీ అమ్మ మోసపోయింది. అది మీ నాన్నకు ఈ నాటి వరకూ మాన్పలేని గాయమై ఉండిపోయింది. నీ అందం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. కాని నిన్ను పెళ్ళి చేసికోవటం నీలయ్యకు అసంతృప్తిని, ఆశాభంగం కలిగిస్తుందని నాకు తెలుసు. నీకు పెళ్ళయిపోయి నీవు దూరంగా వెళ్ళిపోతే నా మనసుకు స్వస్థత చిక్కుతుందని నీ పెళ్ళి గురించి ... నేను ... నేను తొందరపడ్డాను అహల్యా! నేనే తొందరపడ్డాను' చెపుతూ ఆగాను. అహల్యను చూచాను.

నావైపు క్రొత్త వ్యక్తిని చూచినట్లు వింతగా చూచి తలదించుకుంది అహల్య.

'ఇప్పుడు చెప్పు! నీ పరిస్థితికి కారకులెవరు? నీ నుదిటి కుంకుమ చెరిగిపోవటానికి కారకులు......'

'మీరు మాత్రం కాదు. విధి. అంతే! అలా జరగాలని ఉంది. జరిగిందంతే!' అని ఊరుకుంది అహల్య.

'ఈ వయసులో నీవే యిలాగ ఉండటం నాకు బాధగా ఉంది. నీవు అంగీకరిస్తే సంబంధాలు చూదాం! నీవు మళ్ళీ......'

'బాబూ!' అరచింది అహల్య. ఆమె కళ్ళలో నీళ్ళు నిండాయి.

'బాబూ! అలాటి సలహాల నీయకండి. జీవితంలో ఎవరికైనా ఒకటే మనువు' అంది అహల్య చేతిలో ముఖం దాచుకుని.

నేనేమీ మాటాడలేక పోయాను. కొద్దిసేపు మౌనంగా ఉండి లేచి వచ్చేశాను.

తరువాత ఆరు నెలలకే అనకాపల్లికి ప్రమోషన్‌మీద వెడుతూ నీలయ్యను చూడ వెళ్ళాను. నీలయ్య దుకాణం మూసి వుంది. అప్పటికి మూడు నెలలనుండి నీలయ్య కొట్టుకు రావడం లేదని తెలిసి నీలయ్య యింటికి వెళ్ళాను నన్ను చూచి నీలయ్య బావురుమన్నాడు. పరిస్థితి తెలియని నాకు అహల్యే కన్నీరు పెట్టుకుని చెప్పింది:

'నావల్లనే అందరికీ కష్టాలు వచ్చాయి బాబూ! నే నిక్కడ వుండటం మా మరదలికి యిష్టపడటం లేదు. తమ్ముడిని తీసుకుని వెళ్ళిపోయింది. చంద్రం ఇక్కడ లేడు. ఏ విధంగానైనా తమ్ముడికి నచ్చచెప్పి తీసుకొని రా బాబూ! కావాలంటే నేనే ఎక్కడికైనా వెళ్ళిపోతాను' అంది అహల్య.

'నీ వెందుకు వెళ్ళటం? చంద్రాన్నే తెచ్చే ప్రయత్నం చేదాం' అన్నాను.

'కాదు బాబూ! కాదు! ఇది నేనుండవలసిన చోటు కాదు. ఇది వాడి యిల్లు. తమ్ముడిని తెచ్చే ఉపకారం చేసి పెట్టు బాబూ! నాన్న బాధతో క్రుంగిపోతున్నారు. మమ్మల్ని విడిచి ఎప్పుడూ వుండలేదు నాన్న' అంది అహల్య.

చంద్రాన్ని తెచ్చి వప్పగిస్తానని మాట యిచ్చి అనకాపల్లి చేరాను. అవకాశాన్ని చూచుకొని రెండు రోజులు సెలవు పెట్టి చంద్రం దగ్గరకెళ్ళి అతన్ని సమాధానపరచి కొన్ని విధులను బోధపరచి, చంద్రాన్ని తీసుకొచ్చి నీలయ్యకు అప్పగించాను. వచ్చే ముందు నీలయ్య అన్నాడు 'బాబూ! ఒక ఉత్తరం రాసిపెట్టవూ! సీత ఎక్కడుందో వ్రాసి తెలుసుకో బాబూ! సీతను చూడాలని వుంది. మన వూరిలో ఎవరికైనా వ్రాయి బాబూ సీతగాని నే లేనప్పుడు వచ్చిందేమోనని, ఎక్కడుందో కనుక్కో బాబూ! ఈ ఉపకారం చేసిపెట్టు బాబూ! ఆ అమాయకురాలు ఎన్ని బాధలు పడుతోందో! ఉత్తరం రాసిపెట్టవూ!' అని.

నీలయ్యకు ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు.

ఉత్తరం వ్రాస్తానని మాట యిచ్చేసి వచ్చేశాను.

అది జరిగిన నెల రోజులకు ఒక ఉదయం నీలయ్య అనకాపల్లి వచ్చి కలిశాడు.

కొడుకుచేత నిరాదరింపబడిన నీలయ్య చెప్పింది విని నిర్విణ్ణుడనైపోయాను.

అహల్య వెళ్ళిపోయింది.

సీతలాగ వెళ్ళిపోలేదు.

ఒకవైవిధ్యాన్నిచూపిస్తూ వెళ్ళిపోయింది.

చంద్రం భార్య తమ్ము వదుల్చుకోడానికి మోపిన నిందను శ్రీగా భరించలేక వెళ్ళిపోయింది.

నీలయ్య కంఠంతో మరింత హాలాహలం ఉంచుతూ వెళ్ళిపోయింది అహల్య.

తాను వెళ్తున్నది తల్లిని కలియటానికి అన్నది అహల్యకు తెలియకపోవచ్చు.

నీలయ్య తరువాత ఎక్కడికెళ్ళాడో నాకు తెలియదు.

బహుశా సీతకోసం వెతుకుతున్నాడేమో.

నీలయ్య పాత్రం నీలకంఠమే. ●





అశోక్ బ్రదర్స్ సమర్పించు.

శ్రీ కామాక్షీ ఏజెన్సీస్ వారి

# మా ఇలవేల్పు

దర్శకత్వం: జి.వి.ఆర్. శేషగిరిరావు

స్క్రీన్‌ప్లే: జి.ఎన్. వేలుమణి మాటలు: రాజశ్రీ

ఆంధ్ర
శ్రీ కుమారస్వామి పిక్చర్స్
సీడెడ్
బలరామ్ పిక్చర్స్
నైజాం
శ్రీ పద్మా పిక్చర్స్





SKES

Kaushikalaya



మారిషస్ ప్రధాని రామ్‌గులామ్ నివాసమందిరంలో నటసమ్రాట్ నాగేశ్వరరావు.

## సినిమా

## మారిషస్ అనుభవాలు

మారిషస్‌కి వెళ్ళిన నవరతనాలు స్వదేశానికి తిరిగివచ్చారు. తమ అనుభవాలను ప్రజలకు తెలియపరచడానికై పాత్రికేయులకు జూన్ 1వ జగపతి అధినేత వి. బి. రాజేంద్ర ప్రసాద్ 'సవేరా'లో మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేసారు.

* * *

విందు రుచి చూసిన తర్వాత, హీరో నాగేశ్వరరావు (మేకప్‌తోనే వచ్చారు) లేచి 'నేను న్యాయంగా తెలుగులోనే మాట్లాడాలి. కానీ, యితర భాషా మిత్రులు వుండం వల్ల, ఆంగ్లంలో మాట్లాడవలసి వస్తూంది' అన్నారు.

## ప్రేమ—అభిమానం

'స్వాతంత్ర్యం సారధి మ్మడియోకి విజయం చేసిన మారిషస్ సెక్యూరిటీ మినిస్టరు. వాళ్ళ దేశానికి మమ్మల్ని ప్రభుత్వ అతిథులుగా రమ్మని ఆహ్వానించారు. అక్కడి ఆంధ్ర మహాసభతో సంప్రదించి, మాకు ఆహ్వానాలు పంపించారు. మేము మే 18న బొంబాయిలో బయల్దేరి 19న మారిషస్ చేరాము. మమ్మల్ని చూడడానికి వేల సంఖ్యలో స్త్రీ పురుషులు విమానాశ్రయానికి వచ్చారు. వాళ్ళ ఉత్సాహం, మా పట్ల చూపిన ప్రేమాభిమానం జన్మజన్మలకు మరువలేము. చాలా కాలం తర్వాత వాళ్ళ ఆత్మబంధువులు వచ్చారే అన్న వారి అనుభూతి వారి ఆదరణలో తేట తెల్లమయింది. మాకు 'శాంతి' అని పలికేవారు. 'శాంతి' అంటే శుభం కలగాలి అన్నమాట. వాళ్ళు నిండు మనస్సుతో మాకు స్వాగతం పలికారు.'

## ఎక్కువ శాతం భారతీయులే

మారిషస్ వైశాల్యం 712చ. మైళ్ళు; అక్కడి జనసంఖ్యలో తెలుగువాళ్ళు 45,000; తమిళులు 75,000, మిగతా వాళ్ళలో బీహారీలు, పంజాబీలు, ముస్లింలు ఎక్కువగా వున్నారు. చైనీయులు 20,000 మంది వున్నారు. అంటే వారి జనాభాలో 75 శాతం భారతీయులున్నారు. మాకు ప్రతిరోజూ వూపిరి సలపని కార్యక్రమాలు. ఉదయం లంచ్‌లో 'బీర్', రాత్రి 'కాక్‌టైల్' తప్పనిసరి. అక్కడ ఎక్కువగా పండేది చెరకు. చక్కెర ఫ్యాక్టరీలు అధికంగా వున్నాయి. కొండ ప్రదేశాల్లో కూడా చెరకు పండుతుంది. ప్రకృతి సమయానుకూలమైన వర్షాన్ని కురిపిస్తుంది. టొమాటో, పొగాకు యిక్కడి యితర పంటలు. వరి తదితర ధాన్యాలను విదేశాల నుండి దిగుమతి చేసుకొంటారు. చాలామంది 'వరి' అన్నాన్నే తింటారు వాళ్ళ రూపు రేఖలు మనలాగే వుంటాయి. మనకన్నా కాస్త నలుపు రంగు వాళ్ళది. అక్కడి స్త్రీలు సాధారణంగా చీరెలనే ధరిస్తారు. వాళ్ళ ఆత్మీయత, ఆప్యాయత మమ్మల్ని మంత్రముగ్ధుల్ని చేసాయి. మమ్మల్ని చూసినప్పుడు వాళ్ళ కళ్ళంట ఆనందబాష్పాలు వచ్చాయి ఆ దృశ్యం మా కళ్ళలో ఇంకా మెదులుతూనే వుంది. మాకు ప్రధాని మందిరంలో విందు, మేయర్ విందు, సెక్యూరిటీ మినిస్టర్ డిన్నర్, హైకమీషనర్ యింటి భోజనం—ఇలావున్న వారం రోజులలో మమ్మల్ని వుక్కిరి బిక్కిరి చేసేసారు.

## భాషపై ఆసక్తి

'మీ రిలిజియన్ యేది?' అనగానే 'మేము భారతీయులం. మాకు మా భాష నేర్చుకోవాలని వుంది. మా తాత ముత్తాతలు భారతంలో వుండేవారు' అని చెప్పేవాళ్ళు. అక్కడ 'మిక్స్‌డ్ కల్చర్' వాడుకలో వుంది. 45,000 మంది తెలుగు వాళ్ళుంటే, తెలుగు భాషను తెలిసినవాళ్ళు 5 వేల మందే. అక్కడ వాడుకలో వుండే కరెన్సీని రూపాయి అంటారు. పైసా కూడా వుంది. మన రూపాయి—180 పైసలు అక్కడ.



మారిషస్ వెళ్ళిన మన బృందం.

5 వ తరగతి నుండి మెట్రిక్ వరకు సుశిక్షణ. సుప్రసిద్ధ విద్యాసంస్థ

**శ్రీ రామా రూరల్ కళాశాల (గురుకులము)**

స్థాపితము: 6—6—1949. పునః ప్రారంభము: 4-6-1971

చిలుమూరు (P.O), (వయా) అనంతవరము, తెనాలి (R.M.S) గుంటూరు జిల్లా

4 వ తరగతి స్థాయిగల విద్యార్థులు 5 సం. లలో మెట్రిక్ పరీక్షకు పంపబడుదురు
లేబరేటరీ, హాస్టల్ వసతులు కలవు.

ప్రశాంత వాతావరణము — పరిమిత వ్యయము — సత్ఫలితములు

ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలనుండి విద్యార్థులరుదెంచి విజయమును సాధించుచున్నారు.
"విశారద" తెలుగు, ఆంధ్రా యూనివర్శిటీ తెలుగు యంట్రన్స్ పరీక్షలకు ప్రత్యేక తరగతులు.
వివరములకు: Kollur—24 p. c. o. Extension—1

కొంతసాని వెంకటసుబ్బయ్య చౌదరి, మేనేజరు.
కె. యం. మధుసూదనరావు, M.A., B.Ed., ప్రిన్సిపాల్.

SWASTIK

**రూ. 13,000 గెలుపొందండి.**

ఆల్ కరెక్టు రు 8000 లు, 1 తప్పునకు రు. 1400 లు, 2 తప్పులకు రు. 1000 లు లఘువు ఎంట్రీ రు.1000 లు, [మొదటి 6 కాలముల ఆల్‌కరెక్టుకు మాత్రమే] ప్రత్యేక లఘు ఎంట్రీ రు.1000 లు,[7, 8, 9 కాలముల ఆల్‌కరెక్టుకు మాత్రమే] ఎక్కువ ఎంట్రీలు పంపిన 1, 2, 3 వ వారలకు రు. 600లు.

**శ్రీ వేంకటరమణా అండ్ కో (రిజిష్టర్డ్) సాహిత్యపు పోటీనెం—4**

[సుప్రీంకోర్టు తీర్పు ననుసరించి నడుపబడుచున్న సాహిత్యపు పోటీ]

ముగింపు తేది 18—6—71 వ తేదీకి పొడిగింపబడినది. ఈ తేది ఇక పొడిగింపబడదు. కీ సొల్యూషన్ 25—6—71. 1 ఎంట్రీ రు. 1—00, 5ఎంట్రీలు రు. 4—00లు 10 ఎంట్రీలు రు. 7—00లు. 5 ఎంట్రీలకు 1 లఘువు ఎంట్రీ ఉచితము. 300 ఎంట్రీలకు ఒక ప్రత్యేక లఘువు ఎంట్రీ ఉచితము.

ఆధారములు:—

1. ————ధనికుచే కప్పబడుచున్నది. (సత్యము / అసత్యము)
2. నిజముగా బలుక నెవ్వరును ————కారు. (కురూపులు / సుందరులు)
3. ఇంత మిట్టమధ్యాహ్నం వేళ ———— ఎందుకు? (రావడము / వెళ్ళడము)
4. నీకట్టి యత్యధిక ———— లభించునా? (సుఖము / సంతోషము)
5. ———— అంతయు ఒక్కరీతిగా నడువదు. (లోకము / కాలము)
6. అబ్బో! తాటాకు చప్పుళ్లకు ———— బెదరునా? (కుందేళ్ళు / తోడేళ్ళు)
7. ఈ లోకమంతయు ————ఆధీనమై యున్నది. (దైవ / ధన)
8. సత్యమనియు ———— అనియు లోకంబున లేకపోలేదు. (ధర్మము / దైవము)
9. మనుష్యుల ————బహు విచిత్రమైనవి. (మనస్సులు / భావాలు)

ప్రధాన నిబంధనలు:— ఒకరు ఎన్ని ఎంట్రీలనైనను పంపవచ్చును. ఒకరు ఎన్ని బహుమతులైనను పొందవచ్చును. ఎంట్రీ రుసుము ఎమ్.వో. ద్వారాగాని, ఐ. పి. ఓ. ద్వారాగాని పంప వచ్చును. ఎమ్. వో. ద్వారా పంపినచో ఎమ్. వో. రశీదు జతపరుపవలెను. ఎంట్రీలు తెల్లకాగితముపై వ్రాసి పంపవచ్చును. అన్ని విషయములలోను మేనేజిమెంటు వారిదే తుది నిర్ణయము, 30 పైసలకు తగ్గకుండ 10 ఎంట్రీలకు 30 పైసల చొ॥ న పోష్టల్ స్టాంపులు పంపి మా నుండి అచ్చు ఎంట్రీ ఫారములను పొందవచ్చును. ఎంట్రీలలో ఎడ్రస్ స్పష్టముగా తెలుగులో వ్రాయవలెను.

ఎంట్రీలను

**శ్రీ వేంకటరమణా అండ్ కో (రిజిష్టర్డ్) సాహిత్యపు పోటీ నెం-4**

శ్రీ రామపురం — భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా, (A.P.) ఫోన్ నెం. 409.

## సినిమా

మేము టి. వి. ఇంటర్వ్యూలు యిచ్చాము. సెంటిమెంట్స్ మూర్తీభవించిన మారిషస్ ప్రజలను అప్పుడే వదలి రావడమా? అనిపించింది. కానీ ఏం చేస్తాం? ఇక్కడ షూటింగులు వున్నాయిగా' అన్నారు అక్కినేని.

### 'శిగా' నృత్యం!

అక్కినేని చెప్పిన విషయాలనే కాంచన కూడా వివరించింది. దర్శకుడు మధుసూదనరావు మాట్లాడుతూ 'అక్కడి ప్రధాని పేరు రామ్‌గులామ్, యాక్టింగ్ ప్రధాని పేరు వీరాసామిరెంగడు అని తెలియగానే వాళ్ళు మనవాళ్లే అన్న భావం ప్రతి ఒక్కరికీ

### మీకు తెలుసా?

నటి లక్ష్మికి ఆడపిల్ల పుట్టింది.

గాయని సుశీలకు అబ్బాయి పుట్టాడు.

హాలివుడ్ నటుడు రెక్స్ హారిసన్ తన నాలగవ భార్యకు విడాకులు యిచ్చాడట.

జార్జ్‌స్కాట్ తనకిచ్చిన ఆస్కార్ అవార్డును తిరస్కరించాడట. తన కన్నా అనుభజ్ఞులు ఎంతోమంది వుండగా, అవార్డు తనకివ్వడాన్ని అధిక్షేపించాడట.

నటుడు రిచర్డ్ బర్టన్ తన భార్య ఎలిజబెత్ టెయిలర్ జీవిత కథను పుస్తకంగా వ్రాసాడట.

కలుగుతుందిగా. సీతన్న, అప్పడు, రామన్న పేర్లు కూడా చాలామందికి వున్నాయి. వాళ్లకు తెలుగు భాషపై మక్కువ వుంది. కానీ వాళ్ళకు బోధించే నాథుతేరీ? ప్రభుత్వం మనదేశంనుండి కొంతమంది తెలుగు వుపాధ్యాయులను పంపిస్తే, ఆ ప్రజల ఆశ యీడేరుతుంది. 'ఉగాది'కి సెలవు లేదని మాకు తెలిసింది. తెలుగు సంవత్సరాదియొక్క అవుచిత్యాన్ని ఆ ప్రభుత్వానికి తెలియచేసాము. వాళ్ళు మా సూచనను త్వరలోనే అమలు పరచి, 'ఉగాది'ని సెలవు దినంగా ప్రకటించనున్నారని తెలిసింది. అక్కడ 'శిగా' అనబడే నృత్యం వాడుకలో వుంది. వెస్టరన్ మ్యూజిక్ వినిపించినా అతి మగ ప్రత్యేకంగా ప్రవతి

వారి] అభినయించడం విశేషం' అన్నారు. మేము వెళ్లిన ఏర్‌క్రాఫ్ట్ పేరు 'అన్న పూర్ణ.'

## మారిషస్ ప్రభుత్వ సూచన

నిర్మాత దర్శకుడు రాజేంద్రప్రసాద్; 'మారిషస్ ప్రభుత్వం 60 రోల్స్ కలర్ నెగటివ్ యిస్తామని, చిత్రనిర్మాణానికి కావలసిన సకల సౌకర్యాలను తాము చెయ్య డానికి రెడీగా వున్నామని, దానికి మారుగా మనం నిర్మించే చిత్రంయొక్క ఒక ప్రింటును వాళ్లదేశంలో ప్రదర్శన నిమిత్తం యిస్తే చాలునని చెప్పారు· మన ప్రభుత్వం, ఛేంబరు సహకరిస్తే, అక్కడి సదుపాయా లను సద్వినియోగం చేసుకోవచ్చు' అన్నారు. 'నా ఆహ్వానాన్ని మన్నించి, వచ్చిన ప్రతి కేయులకు ధన్యవాదాలు' అని సభను ముగించారు.

## త్రివేణి ప్రొడక్షన్స్

1971లో వెలసిన క్రొత్తసంస్థ. నిర్మాత పేర్రాజు; దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి. తమిళంలో విజయవంతంగా ప్రదర్శింపబడిన 'స్కూలు మాష్టర్'ను సరికొత్త మార్పు లతో 'బడిపంతులు'గా నిర్మించడానికి పూను కున్నారు. టైటిల్ పాత్రను ఎన్టీ రామా రావు ధరిస్తారు. ఆచార్య ఆత్రేయ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను నిర్వహిస్తున్నారు. ముఖ్య భూమి కలను నాగభూషణం, అంజలీదేవి, రాజ బాబు, రామకిష్ణ, కృష్ణంరాజు, మణి మాల పోషిస్తారు. జులై నుండి రెగ్యులర్ షూటింగు వుంటుంది.

## కొత్త ఆకర్షణ

'భక్తప్రహ్లాద' పాత్రను అత్యంత ప్రతిభావంతంగా పోషించిందెవరు? బేబీ రోజారమణి అని మీకు తెలుసు. బేబీగా వున్న రోజా, కుమారి అయింది. కుమారి కావడమే తరువాయి రామవిజేతా నిర్మాత ప్రభాకర్ నిర్మిస్తున్న 'రామాలయం' చిత్రంలో వుపనాయికగా నియమించబడింది. చంద్రమోహన్‌కు ప్రేయసిగా నటిస్తూంది. కుమారి అయిన తర్వాత రోజాలో క్రొత్త ఆకర్షణ కనిపిస్తూ వుంది. కళ్ళలో చురుకుదనం, మోములో చక్కదనం, శరీ రంలో సోయగం వుట్టిపడుతూ వున్నాయి.




సుమారు 80 పై. విలువగల

ఉచితం

మీడియం సైజు కోల్గేట్ డెంటల్ క్రీమ్ ప్రతి

చార్మిస్ టాల్క్

పెద్ద డబ్బాకో




CHTP 6. 16 TL

సుఖ జీవిత సేవ

"సిద్ధ వైద్య మహిమ"

సిద్ధుల సాటిలేని కీర్తికి ఒక తార్కాణము



కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి గారి

'మేల్ మాయిల్ మందు'
(Regd)

దీర్ఘకాల చర్మరోగములకు చక్కని నివారిణి

తెల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, పొట్టు, గజ్జి (చర్మసంబంధము) పొడలు గల చోట్లలో తిమ్మిర్లు, సూదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, నిప్పువడి బొబ్బలు గలిగినా తెలియకుండుట, దుర్‌నీరు సర్వ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి మత్తు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతి వ్రేళ్లు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదము నందు పగ్గులు పుండ్లు ఏర్పడుట, కాలుచేతులు వ్రేళ్ళు తగ్గుట, ముక్కు సొట్టవడుట, చూచుటకు వినుగు పుట్టించు రణములు (అస్థి సంబంధము) వీటికి చక్కని నివారిణి.

1 మండలం (40 రోజులు) నూనె, లేహ్యము రు. 12/- తపాల ఖర్చు రు. 3.00

8 ఔన్సుల శ్రీ పరమాత్మ తైలం రు.6/- తపాల ఖర్చు రు. 2/-

పెద డాక్టర్

కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు

5/22, మేల్ మాయిల్ P.O., (N.A. Dt.)

# సినిమా డైరీ

● శ్రీ రాజా ఆర్ట్ ఇంటర్నేషనల్ వారి హిందీ 'విచిత్రకుటుంబం' మే 29న ప్రసాద్‌లో ప్రారంభమైంది. తాతినేని ప్రకాశరావు దర్శకత్వంలో దిలీప్, సయిరాబాను నటించారు. 29, 30 (2 రోజులు) జరిగింది.

● మాలినీ ఆర్ట్ ఫిలిమ్స్ 'ప్రియ' షూటింగు మే 29న వాహినిలో ప్రారంభమైంది. బి. నాగిరెడ్డి స్విచ్ ఆన్ చేశారు. గోపీనాథ్ దర్శకుడు.

నవభారత్ మూవీస్ 'రైతుకుటుంబం,' రామవిజేతా పిక్చర్స్ 'రామాలయం' చిత్రాలపాటల రికార్డింగు వరుసగా మే 29న, మే 31న జరిగింది. మొదటి చిత్రానికి చలపతిరావు, రెండవదానికి ఘంటసాల సంగీతసారథులు.

● సురేష్ మూవీస్ 'ప్రేమనగర్' కలర్‌చిత్రం షూటింగు మే 27 నుండి జూన్ 5 వరకు వాహినిలో జరిగింది. నాగేశ్వరరావు, వాణిశ్రీలు పాల్గొన్న సన్నివేశాలను, క్లయిమాక్స్ దృశ్యాలను కె. ఎస్. ప్రకాశరావు చిత్రీకరించారు.

● పూర్ణా ఆర్ట్ పిక్చర్స్ 'కూతురు కోడలు' మే 21న సెన్సారు అయింది. మే 29న సర్టిఫికేటు ఇవ్వబడింది. లక్ష్మీదీపక్ దర్శకుడు.

## సినిమా

గాబట్టి రోజాకు నాయికగా నటించే అవకాశం దగ్గర్లోనే వుందని చెప్పవచ్చు. భగవంతుడు ప్రసాదించిన అందచందాలను, నటనను అదృష్టం కలిసివస్తే, రోజాకు పరిశ్రమలోనూ, ప్రజల్లోనూ మంచి స్వాగతం లభిస్తుంది. రోజా రమణిని వుపనాయికగా పరిచయం చేస్తున్న దర్శకుడు బాపయ్యరావు అభినందనీయులు.

—శ్రీనివాస్ ●

## విశ్వవిద్యాలయాల్లో...

27 వ పేజీ తరువాయి

900 సంవత్సరాల నుంచీ అర్థమవుతున్న భాష 1971 లో అర్థం కాలేదంటే అర్థంలేదు అర్థం చేసుకోలేని వాళ్ళెప్పుడూ ఉంటారు. కొంచెం భాషా జ్ఞానంతోనే బ్రతుకుదా మనుకునేవాళ్ళకు దిక్కులేదు.

చదువుకుంటున్న దెందుకు. జ్ఞానం సంపాదించడానికి. జ్ఞానానికి అంతం లేదు. వ్యావహారిక భాష ఎవడూ విశ్వవిద్యాలయాలల్లో నేర్చుకో నవసరం లేదు. భాషాజ్ఞానం లేకపోతే నిరక్షరాస్యునికీ వీడికీ భేదమేముంది. చదువుకున్నవాడి భావ మేమి అభిప్రాయానైనా సులువుగా వెలిబుచ్చ గలుగుతుంది. భాషాజ్ఞానం ఉండాలంటే చదువుకోవాలి. వ్యావహారిక భాషను విడిగా చదువుకో నవసరంలేదు.

అసలు తెలుగే యెత్తివేయాలంటే— వాళ్ళకు చెప్పేదేమున్నది.

ఈ క్రింద ఇవ్వబడిన తెలుగుమాటలను రచించినది పియ్యూసీ విద్యార్థులు. వారు పరీక్షల్లో వ్రాసిన జవాబులనుండి గ్రహింపబడినవి. తెలుగుభాష తెలుగు వాళ్ళకు ఇంకా బాగా నేర్పాలో లేక అసలు తీసివెయ్యాలో విజ్ఞులైన పాఠకులే నిర్ణయిస్తారు.

'ప్రపంచములో మన ఇండియాలో చదువులో రెండవస్థాయి ఆక్రమించినది.'

'దానికి గాంధీజి చాల బాధను, దయను కలుగుచుండును'

'అప్పుడు ఆహారసప్య కొంత కొంత బాధ తగ్గును.'

'శాంతమ్మకు ఒక్క కోరికగలదు అది యేమి భీమునకవి పెళ్ళి చేసుకుని సంతానము గల్గించు అప్పుడు ఆనందము పొందునట్లుగా ఉండునని దలంచినది అందుకు భీమునకవి ఒప్పుకొనలేదు.'

'ఈ వాక్యము జరాసంధోపాఖ్యానమునుండి గ్రహింప బడినది. లగ్నిత్రయంబులనగా మూడు అగ్నులు. ఈ మాటలు కృష్ణుడు భీమార్జునులతో గిరివ్రజపురమునకు పోవునపుడు అన్నమాటలు.'

—పులిచెర్ల సాంబశివరావు ●


ముగింపు తేదీ :
10-7-71
రిసొల్యూషన్ :
16-7-71
ఆంధ్రపత్రిక దినపత్రికలో

రు. 11,500 గెలుపొందండి !
(7 క్లూలు మాత్రమే)
రాధీ లిటరరీ సిండికేట్ (రిజిష్టర్డు)
వీరంకిలాకు - కృష్ణా జిల్లా (A. P.)
(సుప్రీంకోర్టు తీర్పు ననుసరించి నడుపబడుచున్న సాహిత్యపోటీ—2)

ఆల్ కరెక్టు రు. 6,000
1, 2 తప్పులకు రు. 2,500
చాయిస్ ఎంట్రీ ఆల్ కరెక్టు 1,500
ఎక్కువ ఎంట్రీలు పంపినవారికి, రు. 300, 200
మెరిట్ ప్రైజు రు. 1000.

ఛాయిస్ ఎంట్రీ:— సొత్తము క్లూలనుండి మీకు నచ్చిన ఐదు క్లూలు మాత్రమే పూర్తి చేయండి.
మెరిట్ ప్రైజు:— ఆల్‌కరెక్టు మరియు చాయిస్ ఎంట్రీ రెండింటిలోను గెలుపొందిన వారికి మాత్రమే పంచబడును.
ఎంట్రీ ఫీజు:— 1 ఎంట్రీ రు. 1—00, 6 ఎంట్రీలు రు. 5—00, 5 ఎంట్రీలు పంపినవారికి 1 చాయిస్ ఎంట్రీ ఉచితం.

ఆధారములు :
1. విచారించకుండా వుండలేకపోవటం మానవ (స్వభావం / నైజం).
2. ఈ (మొగ / ఆడ) వాళ్ళకు దగాలేదు.
3. (కష్టా / కలహా) లనేవి కుటుంబం విలవవు.
4. స్త్రీలో ఏదో (సౌందర్యం / ఆకర్షణ) ఉంది.
5. (మొగ / ఆడ) వాళ్ళు ఎంతకైనా తెగుదురు.
6. (దేవుడికి / దైవానికి) దయలేదు.
7 ముందు జరిగేగి తెలుసుకోగల శక్తి (మానవులకు / మనకు) లేదు

ముఖ్య నిబంధనలు : ఒకరే ఎన్ని ఎంట్రీలయినను పంపి ఎన్ని బహుమతులయినను గెల్వవచ్చును. పై వాక్యములలో బ్రాకెట్టులోని ఒకపదమే సరియైనది. (ఇంటూ) (✕) చేసి అంగీకరించిన ఆపదములను తెల్లకాగితము మీద వ్రాసి సరిపడు రుసుమునకు ఎమ్. ఓ. రశీదుకాని, క్రాస్‌చేయని ఐ. పి. ఓ. గాని, మా క్యాష్ రశీదుగాని తప్పక జతపరచి పంపవలెను. ముగింపుతేదీనకూడా ఎంట్రీలు ఎక్స్‌ప్రెస్ డెలివరిలో పంపవచ్చును. పై వాక్యములన్నియూ తెలుగు పుస్తకములనుండి సేకరింపబడినవి విజేతల లిస్టుకు తరువాత ఎంట్రీఫారములకు, 20 పైసల కవరు పంపండి. ఎంట్రీఫారములకు 20 పై. స్వంత విరునామాగల కవరుతో 10 పై. స్టాంపులు పంపండి. మీ ఎంట్రీలు, ఎమ్. ఓ. లు మొదలైనవన్నీ పై అడ్రసుకు పంపండి.



Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press: 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.



నటి నర్తకి గాయని రమ

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.





అశోకా శాండల్ వుడ్ (Regd)

ఫేస్-టాల్కం & ఆల్ పర్పస్ పౌడర్లు

మీకు సదా నవయవ్వన శోభ కావలెనా? అయితే సదా
మీరు అశోకా శాండల్‌వుడ్ పౌడర్స్‌నే ఉపయోగించండి

విజయా కెమికల్స్, మద్రాసు-7